అరుణతార
సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

ఆగస్టు 1997 190

# చిన్న ఆశ

ఓ నా మిత్రమా
నా కాళ్లూ చేతులూ నరుకుతాడా ..... నరకనియ్
నా కనుగుడ్లు పీకుతాడా ...... పీకనియ్
నా శరీరాన్ని కుళ్లబొడుస్తాడా ...... పొడవనియ్
నా గుండెల్లో బుల్లెట్లు దించుతాడా ...... దించనియి
పోయేదేముంది ...... ఒక్క ఊపిరి తప్ప !
శ్వాసుంటే పోరు మొక్క నాటుతా
శ్వాసాగితే మొక్కకు సత్తువౌతా.

— బి. యస్.



గల్పిక :

# సొతంత్రం

ఆగష్టు 15వ తారీఖు

జైబోలో స్వతంత్ర భారత్‌కి జై.... జైబోలో స్వతంత్ర భారత్‌కీ జై మహాత్మాగాంధీకీ జై........

మొదటి రైతు :- ఏందేమో పోరగాండ్లు జేబులో సొతంత్రం, జేబులో సొతంత్రమని లొల్లి బెడతాండ్లు ఇయ్యాలేంది?

రెండవ రైతు :- ఈయాల బడిపోరగాండ్లకు సొతంత్రమొచ్చిన రోజట.... గందుకు గీలొల్లిజేసి గా మూడురంగుల జెండెగురేత్తరట.

(కొన్నాళ్ళ తర్వాత ఓరోజు రైతులు విద్యుత్ కోతను ఎత్తివేయాలని ధర్నా చేయడాన్కి కలెక్టర్ కార్యాలయానికి చేపుకోగానే ఎదురుగా కనిపిస్తున్న మూడు రంగుల జెండాను చూసి)

మొ. రైతు :- గాయాల బడిపోరగాండ్లెగిరేసిన జెండా గిడెగురుతాంది ఈయాల ఈల్లకు కూడా సొతంత్రమొచ్చిన రోజా....

రెం. రైతు :- గదేం లేదు, గిక్కడ గాజెండెప్పుడూ ఎగురుతుంది.

మొ. రైతు :- మరి మనమెప్పుడూ గీ జెండెగురేయం కదా! అంటే బడిపోరగాండ్లకొక్కరోజు సొసంత్రం, ఈల్లకు ఎల్లకాలం సొతంత్రమైతే, ఇగ మనసొంటి గరీబోల్లకు సొతంత్రం లేదా....

రెం. రైతు :- అన్నట్టేగా....మనకిప్పుడు సొతంత్రం లేదు

మొ. రైతు :- మరి, సొతంత్రం తేవడాన్కి తోవలేమీలేవా

రెం. రైతు :- ఎందుకులేవు....మనసొంటోల్లంతా ఒక్కటిగా ఎర్రజెండెగిరేసి గీదొంగపాలకులతోటి కొట్లాడి గెలవాలి....గప్పుడత్తది సొతంత్రం...

— కాదంబరి




సంపుటి : 20 ఆగస్టు 1997

సంచిక : 8 190



వి. చెంచయ్య

వర్కింగ్ ఎడిటర్, అరుణతార

6-5-13, కావలి (Po)

నెల్లూరు జిల్లా - 524 201

ఫోన్ : 42277

జి. కళ్యాణరావు

కార్యదర్శి, విరసం

పార్వతమ్మ గుడివద్ద, గంటాపాలెం

ఒంగోలు - 523 001

ప్రకాశం జిల్లా

ఈ సంచిక వెల : 5 రూ.

సంవత్సర చందా : 50 రూ.

రచనలు, చందాలు

వర్కింగ్ ఎడిటర్ అడ్రసుకే పంపాలి

# విషయసూచిక

సంపాదకీయం స్థానంలో... 

# "ఉరివేసుకున్న శిరస్సు చెప్పిన రహస్యం"

అంబేద్కర్ విగ్రహానికి చెప్పుల దండలు,
ఆగ్రహించిన దళితులపై పోలీసుకాల్పులు,
ఆవేదన, ఆక్రోశంతో ప్రజాకవి కామ్రేడ్ విలాస్‌ఘోగ్రే ఆత్మహత్య,
అరుణ్‌శౌరీ అవాకులు చవాకులు, భారత సవర్ణోత్సవ వేడుకలు !
"దిఖాకే సవారీ ఘోడా గాడీ, హమారా శవోంకో లేజావో రజ్‌వాడీ"

అందంగా అలంకరించిన గుర్రాల బగ్గీలో దళితుడు రాష్ట్రపతి భవన్‌కు వచ్చి బాపూజీ కలలు నిజం చేస్తాడని 'బొంబాయి తమాషా' ఒకవైపు చూపి మరోవైపు ముంబైలోని రమాబాయి అంబేద్కర్ నగర్‌లో పోలీసు కాల్పుల్లో మరణించిన వారి శవాలను, గాయపడిన మనుషుల్ని కుక్కల్లా పందుల్లా ఈడ్చుకొని రజ్‌వాడీ ఆసుపత్రికి తీసుకుపోతుంటే జులై 11 నుంచి 15 వరకు ఆ అమానుష దృశ్యాల్ని చూసిన ప్రజాకవి, కళాకారుడు, గాయకుడు విలాస్‌ఘోగ్రే జులై 15న పొరుగున ఉన్న థానే జిల్లా ములంద్‌లోని తన అరపై అడుగుల ఝోపిడీ పట్టీలో ఉరి వేసుకొని చనిపోయాడు.

'రజనిబంధన్ ఛోడ్‌కే జాగోరే' అని మోగిన పాల్‌రాబ్సన్ వంటి గొంతు దళిత పీడిత జీవితాలనలుముకున్న ఏభై ఏళ్ళ స్వేచ్ఛా విపణి చీకట్లను దిగమింగి మూగబోయింది. ఆయన వయసు ఈ దేశ స్వాతంత్ర్యం వయసు దాదాపు ఒకటే. ఒక దళితుడు, నిరుపేద కష్టజీవి, స్వేచ్ఛా పిపాసి ఈ ఏభై ఏళ్ళు ఎటువంటి స్వాతంత్ర్యం అనుభవించాడనడానికి విలాస్ జీవితమే ఒక నిలువుటద్దం. విలాస్‌కు ఆయన తండ్రి ఆ పేరెందుకు పెట్టాడో కానీ పుట్టుకతో అస్పృశ్యతతో, పుట్టెడు దరిద్రంలో విలాస్ భూమిమీద పడిన మూడేళ్ళకే తండ్రి చనిపోయాడు. తల్లి పోషించలేక శిశువు నొదిలి కానరాని తీరాలకు వెళ్ళిపోయింది. బంధువుల నిరాదరణ నుంచి పూనాకు, బొంబాయికి పారిపోయి విలాస్ భూమితో, ఆకాశంతో, చుట్టూ మనుషులతో కాళ్ళు చేతులాడిస్తూ ఘర్షణ పడకుండా బతకలేమని, అందుకు తన శరీరం తప్ప పనిముట్టు ఏదీ లేదని పసికట్టాడు.

తండ్రి గొంతులోని భజన్ సంప్రదాయాన్ని తన స్వరపేటికలో వారసత్వంగా మోసుకొని వ్యవస్థచే బహిష్కృతుడైన రెబెల్‌గా ఒక పూరిగుడిసెలో జీవితాస్తమయ సంధ్యా వెలుగులు చూస్తున్న అన్నాభావే సాఠే దగ్గరికి చేరాడు. భజన గీతాలు జనగీతాలయ్యే ఒరవడి అక్కడ మొదలైంది. ఉమ్మడి కమ్యూనిస్టు

ఉద్యమానికి, ఇప్టా ప్రజా కళా సంప్రదాయానికి సంకేతాలైన అమర్ షేక్, అన్నా భావే సాథే విలాస్ గొంతులో గూడు కట్టారు.

నక్సల్బరీ నేపథ్యంలో, ముఖ్యంగా ఎమర్జెన్సీ చీకటి రోజుల తర్వాత బొంబాయిలో ఏర్పడిన నవజవాన్ భారత్ సభ, అవ్హాన్ నాట్యమంచ్‌లు విలాస్‌ను కలుసుకునేవరకు ఆయన అక్షరాలా బొంబాయిలో మురికి కాలువ ఒడ్డున తన పల్లెటూరి సెలయేరును కలగంటూ గడుపుతున్నాడు (పాతిపాదీదీ అని ఆయన ఆ తర్వాత కాలంలో రాసిన సుదీర్ఘ గీతం - ఒక కఠోర వాస్తవ జీవితంలోని సంఘర్షణ నుంచి - ఒక సుందర స్వప్నాన్ని చూసే దృశ్యాన్ని అపూర్వంగా చిత్రిస్తుంది.) బొంబాయి నగర వీధుల్లో బాదల్ సర్కార్‌ను మాత్రమే ఆవిష్కరిస్తున్న స్ట్రీట్ ప్లేలకు బాధల, తిరుగుబాటుల పల్లవిని వినిపించే మరాఠీ పావ్‌డా, జానపద సంస్కృతీ విస్తృతిని కలిగించినవాడు విలాస్.

జాగ్‌రే బంధూ - అని తనను, అవ్హాన్ నాట్యమంచ్‌ను, మహారాష్ట్ర ప్రజల్ని ఒక్క ఊపు ఊపాడు. అప్పుడే మొదలైన బట్టల మిల్లుల కార్మికుల చరిత్రాత్మక సమ్మెలో స్వరసర్వస్వంగా దూకాడు. నవజవాన్ భారత్ సభ, అవ్హాన్ నాట్యమంచ్, విలాస్ ముప్పేటల అల్లుకొనిపోయిన ఆ పడుగు - పేకల మిలిటెంట్ సమ్మె బొంబాయ్ కార్మికోద్యమ చరిత్రలో ఒక ఉజ్వల ఘట్టం. ఆ సమ్మె మహారాష్ట్ర లోని పల్లెలతో తెలంగాణా పల్లెలనుంచి వచ్చి భివాండీ, బొంబాయిలలో బతుకుతున్న కార్మికుల జీవితాలకు ఒక విప్లవానుబంధాన్ని కూర్చింది. అందుకే 'అయారే మేదే' గీతం తెలుగు జననాట్యమండలిదో, మరాఠీ హిందీ అవ్హాన్ నాట్యమంచ్‌దో వేరుచేసి చూపడం కష్టం. అసలు విలాస్ ఏ భాషా కవి ? మాతృ భాష మరాఠి. అంతే సులువుగా హిందీలో ఆశువుగా పాట చెప్పగలడు, భావం చెప్తే తెలుగు నుంచి అంతే సమర్థవంతంగా అనుసృజన చేయగలడు. ఎన్నెన్నో జననాట్య మండలి గీతాలను ఆయన మరాఠీ, హిందీలలోకి అనుసృజన చేసాడు. 1983 ఢిల్లీలో అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి (ఆల్ ఇండియా లీగ్ ఫర్ రెవల్యూషనరీ కల్చర్) ప్రథమ మహాసభలు జరిగినపుడు అందులో అనుబంధ సంస్థగా చేరిన అవ్హాన్ నాట్యమంచ్‌లో విలాస్ ప్రముఖ పాత్ర వహించాడు. ఆ తర్వాత 1985లో సింద్రీలో, 88లో కలకత్తాలో, 90లో త్రిచూర్ (కేరళ)లో ఏ ఐ ఎల్ ఆర్ సి రెండవ, మూడవ, నాలుగవ మహాసభల్లో పాల్గొని సాంస్కృతిక ప్రదర్శనలిచ్చాడు. 90 ఫిబ్రవరిలో నిజాం కాలేజీ గ్రౌండ్స్‌లో జరిగిన జననాట్యమండలి 18వ వార్షికోత్సవాల్లో పాల్గొని లక్షలాది ప్రజల ముందు ఇరవై నిమిషాలసేపు గానం చేసాడు. 80లలో రెండుసార్లు బొంబాయిలో నిర్వహించబడిన జననాట్యమండలి, అవ్హాన్

నాట్యమంచ్‌ల కల్చరల్ వర్క్‌షాపులలో క్రియాశీలంగా పాల్గొన్నాడు. బహుశా ఈనాడు భారతీయ భాషా సాహిత్యాల్లో, ప్రజాకళా సాంస్కృతిక రంగాల్లో కామ్రేడ్ గద్దర్ తర్వాత పేర్కొనదగిన కవీ, కళాకారుడు, సాంస్కృతిక కార్యకర్త కామ్రేడ్ విలాస్ మాత్రమేనంటే అతిశయోక్తి కాదు.

అయితే మరి విలాస్ ఆత్మహత్య ఎందుకు చేసుకున్నాడు ?

కా॥ గద్దర్‌పై హత్యాప్రయత్నం జరిగినా, కా॥ విలాస్ ఆత్మహత్య చేసుకున్నా అది ఈ రాజ్యానికీ, సమాజానికీ వున్న హింసా ప్రవృత్తికి రెండు వ్యక్తీకరణ రూపాలు మాత్రమే.

కామ్రేడ్ విలాస్ ఆత్మహత్య ఎందుకు చేసుకున్నాడు అనే ప్రశ్నకు-ఏకలవ్యుడు బొటనవేలు ఎందుకు కోసి ఇచ్చాడు అన్నంత వెనక్కి వెళ్ళకపోయినా ఇదే స్వాతంత్ర్య రజతోత్సవాల్లో దళిత పాంథర్ల అపూర్వమైన ఊరేగింపుపై పోలీసు కాల్పులు జరిగి దళిత పాంథర్ కవి భగవతీజాదవ్ మరణించడాన్ని గుర్తుకు తెచ్చుకుంటే చాలు. అంబేద్కర్ విగ్రహానికి కాంగ్రెస్, శివసేన - బిజెపి ప్రభుత్వాల్లో జరిగిన అపమానాలు గుర్తుకు తెచ్చుకుంటే చాలు.

వర్తమానంలోకి, భారత "స్వాతంత్ర" సవర్ణోత్సవ వర్తమానంలోకి వద్దాం.

జులై 11వ తేదీ ఉదయం ముంబై నగరంలో ఘట్‌కోపర్‌లో రమాబాయి అంబేద్కర్ నగర్‌లో ఉన్న అంబేద్కర్ విగ్రహానికి ఎవరో చెప్పులదండ వేసారు. ఆ ప్రాంతం నూటికి నూరు శాతం దళితులు, అందులోనూ ఎక్కువగా విద్యావంతులు, ఉద్యోగులు వున్న ప్రాంతం. రెండు మూడు గంటల్లో వేలాదిమంది ప్రజలు అక్కడికి చేరుకొని పక్కనుంచే పోతున్న జాతీయ రహదారిలో వాహనాల రాకపోకలు స్తంభింప చేసారు. ఒకటొకటిగా నాలుగు వ్యాన్‌లలో ఎస్.ఆర్.పి. పోలీసులు వచ్చి- ఆ బస్తీకి ప్రవేశంలో వున్న బుధ్‌విహార్ దగ్గర జనంలోకి నేరుగా కాల్పులు జరిపారు. గంట రెండు గంటల్లోనే పదిమంది చనిపోయారు. బుధ్‌విహార్ జాతీయ రహదారికి దగ్గరి దారి. అక్కడ వున్న జనానికి అక్కడ స్టేట్ రిజర్వు పోలీసు వుందని తెలియదు. వాళ్ళు కాల్చడానికే వున్నారనీ తెలియదు. ఆ కాల్పుల్లో మరణించినవాళ్ళు-

1) సుఖ్‌దేవ్ కపాడ్నే (40) రాంబాయి కాలనీలో చిల్లర దుకాణదారు. తుపాకి చప్పుళ్ళు వినగానే ఇంటినుంచి బయటికి వచ్చి కాల్పులు ఆపవలసిందిగా పోలీసులకు విజ్ఞప్తి చేసాడు. పోలీసులు ఆయన తలపై తుపాకి మడమతో కొట్టి జీపులోకి లాక్కున్నారు. కొద్ది నిమిషాల తర్వాత దించేసి, ఆయన తిరిగి పోతుంటే వెనకనుంచి కాల్చి చంపారు.

2) విలాస్ దోడ్కే (20) – కపాడ్నేను కాల్చడం చూసి ఆయన మృత దేహాన్ని తీయబోయాడు. అంతే అతణ్ణి పోలీసులు కాల్చి చంపారు. అతడు ఆటో రిక్షా నడుపుకొని బతికేవాడు.

3) శివశరణ్ (14) – హైపే ప్రక్కన జహిర్భూమికి కూచున్నాడు. పోలీసులు చూసి కాలిస్తే పుచ్చె ఎగిరిపోయింది.

4) కౌసల్యాబాయి – నలుగురి ఇళ్ళల్లో పనిచేసుకొని బతికే మనిషి, సంఘ సేవిక. పోలీసులను కాల్పులు ఆపమని చేతులెత్తి వారిస్తూ గాయపడి పడిపోయిన వారి దగ్గరికి పోబోతుంటే కాల్చారు. ఒంటినిండా తూటాల గాయాలతో మరణించింది.

5) అనిల్‌గరుడ్ (18) - బుధ్ విహార్ దగ్గర నిలబడి చూస్తున్నాడు. గురి చూసి కాల్చారు.

6) నందు కటారే (18) – అనిల్‌గరుడ్‌తో పాటే నిలబడి చూస్తుంటే కాల్చారు.

7) సంజయ్ నిగమీ (22) – బొంబాయి మునిసిపల్ కార్పోరేషన్‌లో ఉద్యోగి. పనికి పోతుంటే కాల్చేసారు. బుధ్ విహార్ దగ్గర ఆయన శవం పక్కన ఆయన లంచ్ పొట్లం పడివున్నదని ప్రత్యక్ష సాక్షులు చెప్పారు.

8) అమర్ ధన్‌వాడే (17) - డిబిపవార్‌చౌక్‌లో ఘర్షణలు జరుగుతున్నాయి. బయటికి రావొద్దు అని తన ఇంట్లో చెప్పడానికి పరుగెత్తుతున్నాడు. పీడిలో అతణ్ణి కాల్చేసారు.

9) సంజయ్ సుభాష్‌కాంబ్లే (28) – ను కూడా పనికి పోతుంటే కాల్చేసారు.

10) బబ్లూవర్మ (22) - హీరామన్ సదాశివ్ గైక్వాడ్‌పై పోలీసులు కాల్పులు జరపడాన్ని తాను పనికిపోతూ చూసి అడ్డుపడబోయాడు. తాను కాల్పులకు గురై మరణించాడు.

ఈ పదిమందిలో బబ్లూవర్మ ఒక్కడే దళితేతరుడు. అట్లాగే సుఖదేవ్ కపాడ్నే, కౌసల్యాబాయి తప్ప ఎవరూ 30 ఏళ్ళయినా దాటిలేరు. పదిమందిలో ఎవరికీ స్వతంత్ర భారతికి ఉన్నంత సవర్ణవయసూ లేదు.

దీన్నిబట్టి దేశానికి ప్రపంచానికి ఒక పెద్ద సవర్ణోత్సవ కట్టుకథగా ప్రచారం అయిన 'ట్యాంక్ థియరీ' (అక్కడ రోడ్డుపై రెండు నిండు గ్యాస్ టాంకర్లున్నాయి. జనం వాటిని తగలబెట్టడానికి పోతుంటే రాగల భయంకర విధ్వంస ప్రమాదాన్ని వారించడానికి కాల్పులు జరిపామన్న సిద్ధాంతం) ఎంత అబద్ధమో అర్థం చేసుకోవచ్చు.

ఇంకా ముగ్గురు ఆ తర్వాత బంద్‌లలో పోలీసు కాల్పులలో మరణించారు. అయితే వీరిలో కొందరు అక్కడికక్కడే మరణిస్తే ఎక్కువమంది గాయాలతో రక్తం స్రవించి అరగంట దాకా ఆసుపత్రికి తరలించక పోవడంవల్ల మరణించారు. సహాయానికి రాబోయిన జనాన్ని కూడా చంపిన ఉదంతాలు పై పదిమందిలో కనీసం ముగ్గురి విషయంలో చూసాం. క్షతగాత్రులయితే ఇంకెందరో. వీరందరినీ రజ్‌వాడీ ఆసుపత్రికి తరలించడంలో చేసిన జాప్యం, మనుషుల పట్లనే కాదు, శవాలపట్ల కూడా పోలీసులు, ప్రభుత్వం ప్రదర్శించిన ఏహ్యాభావం (3 గంటల తర్వాత అంబేద్కర్ విగ్రహం మీదినుండి చెప్పులదండను పోలీస్ ఇన్‌స్పెక్టరు అంతే ఏహ్యాభావంతో తన లాఠీతో తొలగించాడు.) ఇవన్నీ విలాస్‌ఘోగ్రే సున్నితమైన హృదయాన్ని కలచివేసాయి.

మరొకవైపు దళిత నాయకత్వం ఒక దిశ నిర్దేశం చేయలేకపోవడం, తమ నాయకత్వంపై దళిత యువకులు ప్రదర్శించిన ఆగ్రహం అందరికీ తెలిసిందే. మహారాష్ట్రలో విప్లవోద్యమమూ బలహీనంగా ఉంది దళిత శక్తుల్లో అనైక్యత. విప్లవ శక్తుల్లో అనైక్యత. దళిత విప్లవ శక్తుల్లో తాను ఆకాంక్షిస్తున్న ఐక్యతకు ఒక ఆకృతి రాకపోవడం – ఇవన్నీ ఆయనను ఒక అసహాయమైన ఆగ్రహానికి గురి చేసాయి. కొడుకు మిలింద్ చిన్న ఉద్యోగంలో చేరి నెలరోజులయింది. భార్య తన అనారోగ్యంతో కొడుకు దగ్గరే వుండి వైద్యం చేయించుకుంటున్నది. కూతురు కవిత పాపతో పాటు అత్తవారింట్లోనే వుంది. రెండు మూడు నెలలుగా తన కుటిలో తానొక్కడే.

ఇంకొక కూతురు నూతన. 92లో ఆమె వివాహమైంది. వరకట్నం తెమ్మనే భర్త వేధింపులు భరించలేక తండ్రి ఇంటికి వచ్చి 95 జులై 15న ఆత్మహత్య చేసుకున్నది. పోలీసు కాల్పుల్లో మరణించిన 14 సంవత్సరాల శివశరణ్ మృత్యువు తన కూతురు ఆత్మహత్యను గుర్తుకు తెచ్చివుంటుందని అంటున్నారు.

విలాస్ 95 ఫిబ్రవరిలో ఢిల్లీలో ఏ ఐ పి ఆర్ ఎఫ్ 'జాతుల సమస్య- అంతర్జాతీయ సెమినార్'లో పాల్గొని, జాతుల పోరాటంపై సుదీర్ఘమైన పాటను ప్రదర్శించాడు. గద్దర్‌పై హత్యాయత్నాన్ని ఖండిస్తూ ముంబయ్‌లో జరిగిన సభలో పాల్గొన్నాడు. అదే ఆఖరు.

ములుండ్‌లోని ఒక గుజరాతీ స్కూల్‌లో ఆయన 14 సంవత్సరాలుగా చప్రాసీ ఉద్యోగం చేస్తున్నాడు. ఆ జీతం చాలక 90లలో రోజూ సాయంత్రం ఆ బస్తీలోని రిపబ్లికన్ పార్టీ ఆఫీసులో పనిచేసేవాడు. పిటిషన్లు రాసిపెట్టడం మొదలు ఆర్ పి ఐ నాయకులకు ఉపన్యాసాలు, ఎన్నికల ప్రచార గీతాలు– మనసుకంటని

'కసాయి' పనులు ఎన్నో చేయక తప్పలేదు. అయితే ఆయన మరణించింది మాత్రం ఇంట్లో గోడమీద ఆయన రాసిన ఆఖరి సందేశంలో చెప్పినట్లు— దళిత శక్తుల ఐక్యత కోసం. ఆత్మహత్య నోట్‌లో కాగితంపై రాసినట్లు "జై భీమ్! క్రాంతికారీ అభినందనలతో షాయర్ విలాస్" కన్నుమూసాడు.

ఔరంగాబాద్ విశ్వవిద్యాలయానికి అంబేద్కరు పేరు పెట్టాలన్న ఉద్యమంలో 'జల్తాయ్ మరట్వాడా' పేరుతో ఆయన రాసిన పాట ఇవ్వాల్టికీ మరట్వాడా అంతటా అందరి పెదవులపై ఆడుతోంది. బొంబాయ్ మారణకాండ సందర్భంగా హిందూ మతోన్మాదానికి వ్యతిరేకంగా, గుడిసెవాసుల ఆవాసాలు తొలగించకుండా సాగిన పోరాటంలో స్వయంగా పాల్గొని వాళ్ళ నీడ కోసం ఎన్నెన్నో పాటలు రాసాడు.

పాట ఆయన రక్తంలో ఉన్నది. అది మునివేళ్ళలోంచి డప్పుమీదికి నాభి నుంచి నాటకమీదికి అళువుగా ప్రవహించి వస్తుంది.

ఆ ప్రవాహం ఆగిపోయింది. ఆయన కవితా జలాశయం మనకు మిగిలింది.

అంతకన్నా మనకు మిగిలిన ఆయన ఐక్యతా ఆశయం గొప్పది.

ముంబైలో అంబేద్కర్‌కు జరిగిన అవమానానికి, దళితులపై పోలీసు కాల్పులకు నిరసనగా మహారాష్ట్రలో ఆ మహానగరంతో పాటు 35 పట్టణాలు స్వచ్ఛందంగా బంద్ పాటించాయి. గుజరాత్, ఢిల్లీల దాకా ఈ సెగ ఎగదట్టింది.

అయినా అగ్రకుల అహంకారం కోదాడలో అంబేద్కర్ విగ్రహాన్ని అవమానపరిచింది. అంబేద్కరు విగ్రహాన్ని అవమానపరచడం మాత్రమే కాదు- అంబేద్కర్ వ్యక్తిత్వాన్ని, ఆలోచనలను, ఆశయాలను అవమానపరిచే అరుణ్ శౌర్యం ఎట్లా సాధ్యమవుతున్నది? ఇది నిషేధించో, తగులబెట్టో రూపుమాపేది కాదు- ప్రతిఘటించి కాలం చెల్లిందని రుజువు చేయాల్సిన సంస్కృతి. అత్యంత ఆధునిక సాంకేతిక వనర్ల సహాయంతో సామ్రాజ్యవాదం పోషిస్తున్న భావజాలం. ప్రపంచబ్యాంకు ఆదేశాలతో ప్రభుత్వాలు నడుస్తున్న రోజుల్లో ప్రపంచబ్యాంకు మేధావి అరుణ్‌శౌరీ మానవుడైన అంబేద్కరును కాకుండా దేవుళ్ళను పూజించమని చెప్పడంలో ఆశ్చర్యం లేదు. అయితే మనకీ అబద్ధపు దేవుళ్ళే కాదు, నిజమైన దేవుళ్ళూ అక్కర్లేదు. ఎవరినైనా సరే పూజించే సంస్కృతి అక్కర్లేదు. మనుషుల జీవితాలతో, పోరాటాలతో, మరణాలతో మమేకమై స్పందించిన కళాకారుడు విలాస్ కోసం, రాంబాయి అంబేద్కర్ నగర్ అమరుల కోసం, నిజమైన స్వతంత్రం కోసం అసువులు అర్పించిన జ్ఞాత, అజ్ఞాత అసంఖ్యాక వీరులకోసం వినమ్రంగా—

—విప్లవ రచయితల సంఘం (విరసం)
అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి
(ఏ ఐ ఎల్ ఆర్ సి)

# కవిత

## ముప్పై వసంతాలు
## ముప్పై శిశిరాల వీరాదుగా...

నెత్తుటి నరాల్ని పీకి విల్లంబులు కట్టిందెవరు ? ఊపిరినంతా మందుగుండుగా దట్టించి శత్రుకోటల మీదకు ఎక్కుపెట్టిందెవరు ? యుద్ధ శిఖరాల మీద మరఫిరంగులై మార్మోగిందెవరు ? బుగులుకున్న నిప్పుల్ని పెనుమంటలుగా మండించిందెవరు ? తొలి తొలి తొలకరి జల్లుకై నెత్తుటి నాగేటి చాళ్ళల్లో కురిసిందెవరు ? అమరులూ ! వీరులూ మీరు !!! కొన్ని నిప్పురవ్వలు కొన్ని నీటిజల్లులు కొన్ని వానమబ్బులు కొన్ని నెలవంకలు కొన్ని వరికంకులు కలిసి రూపెత్తిన పోరెత్తిన హోరెత్తిన పిల్లకాలువా ! నీ పేరేమిటి ? చాయబాబూ సరోజదత్తల స్మృతిలో సత్యం కైలాసంల అమరత్వంలో పాణిగ్రహీ ప్రాణం పోసిన జనం పాటల్లో నిర్మలక్క దారితీసిన పోరుబాటల్లో తడిసి మెరిసి ఎరుపెక్కిన - ఓ అరుణ పతాకమా ! చేగొనుమా రెడ్‌శాల్యూట్స్ !!

### I

నేను వసంతకాలమేఘ గర్జనను
నీటిబొట్టును, వానజల్లును, బక్కప్రాణిని
నేనప్పుడు కేవలం ఓ పిల్ల కాలువను.

అసలు నా పుట్టుకే ఓ ప్రళయం, ఓ అనివార్యం
కారు చీకటి గుండెల్లో ప్రకంపనం
అడవుల మీద వీచిన తొలి తుషారం
నా ప్రసవవేళ నా తల్లి ఆకాశమై ఆవిష్కరించింది
నా ఆవిర్భావానికై ఈ పుడమంతా తరాల వేదనతో ఎదురుచూసింది.

నాకు పుట్టుకే కాని చావు లేదు
నిలబెట్టి కాల్చి నిలువెల్లా పాతెట్టినా
నేను తిరిగి పుడుతూనే వుంటాను
ఈ నేలను చీల్చుకొని మళ్ళీమళ్ళీ మొలకెత్తుతూనే వుంటాను

నా పుట్టుకలు అనంతం
దాహమై పుడతాను
అన్నమై పుడతాను.

ఆయుధాన్నై పుడతాను.
నాకు తెలుసు నా రాకకై
కోట్లాది ఎండిన పెదవులు పలవరించాయి.
అణగారిన బతుకులు పిడికిళ్ళెత్తి నిరీక్షించాయి.

భూమి గుండెల్లో ఒదిగిన స్వప్నాలు,
భూమి దేహాన్ని చీల్చుకొచ్చిన చిరుమొలకలు,
ఎడారుల మీద భారంగా కదిలే లేత మేఘాలు,
కొండకోనల్లో, లోయల్లో, అడవుల్లో
సుడులు తిరిగే వేడిగాలి హోరులు

నా కోసం నిరీక్షించాయ్
నా కోసం నెత్తురిచ్చాయ్
నా రాకకై చలించాయ్
నా రాకనే స్మరించాయ్ !

నేనీ నేలను స్పర్శించేనాటికి సరైన సారమున్నా
స్పష్టమైన రూపం లేనివాడ్ని, పసికందును
ఉద్యమం నెలబాలుడిని
ఉద్రేకమై ఉబికే నీటిబుగ్గను
తప్పటడుగుల పిల్లకాలువను.

కలకత్తా నగర నడివీధుల్లో ధ్వంసమైన
విగ్రహ శకలాలమీద ప్రతిబింబించిన యువత ఆగ్రహపు
ఆవేశాన్ని నేను,
చరిత్ర చెక్కిలి మీర ఎర్రెర్రగా
చిత్రించబడ్డ శ్రీకాకుళ నెత్తుటి త్యాగాన్ని నేను.
భూమికోసం భుక్తికోసం విముక్తికోసం
గిరిజనుడు ఎక్కుపెట్టిన విల్లంబును నేను.

ఎగుడు దిగుడుల గమనంతో
నిర్దిష్ట గమ్యం లేకముందే
నా దేహం ఎన్ని పీలికలు చీలికలైందో,
నా నుండి విడివడ్డ మంచినీటి ప్రవాహాలు
చలన చైతన్యం అడుగంటి బురదమడుగులై పోయి
ఎన్ని పందులకు నెలవులై పోయాయో
నాకు తెలుసు
నన్ను రికార్డు చేస్తూనేవున్న చరిత్రకు తెలుసు !

అయినా సరే
నేను ఒంటరి పిల్లకాలువనైనాసరే
నేనెప్పుడూ ప్రవాహాన్నే
నేనెప్పుడూ సమూహాన్నే
విజయమో అపజయమో
ముందుకే నా ప్రయాణం
అప్పుడు యుద్ధమే నా ప్రమాణం !

* * *

ఎడతెరిపిలేని నెత్తుటి జల్లుల్లో తడిసి నిత్యం ఎరుపెక్కుతూనే వున్న ఆ స్వప్నం పేరేమిటి? విస్తరిస్తున్న ఎర్రపూలవనాల్ని ఎదలకెత్తుకొని యుద్ధమై రాటు తేలుతున్నదెవరు ? ప్రజలే చరిత్ర నిర్మాతలని ప్రజలే నిజమైన గురువులని పల్లెలే నిజమైన పాఠశాలలని ప్రకటించిందెవరు ? ప్రజా విముక్తికై గెరిల్లా సైనికులై దండుకట్టి కదిలిందెవరు ? వాళ్ళు జనం బిడ్డలు ! రణం బిడ్డలు !! ఓ నెత్తుటి రుతువా ! నీవు మా కాలానివి ! మృత్యువులోనే పాట పాడతాం విప్లవమా ! నీకు లాల్‌సలామ్ !! ఓ సాగరం ఓ సూర్యం ఓ సుదర్శనం ఓ సంజీవం ఓ ప్రకాశం ఓ జ్యోతి ఓ పద్మ ఓ కుమారి - ఎందరు అమరుల త్యాగఫలంతోనో ఎరుపెక్కిన పదునెక్కిన పోటెత్తిన ఓ విశాల నదీ ప్రవాహమా ! రేపటి నీ రూపేమిటి ? గోండన్నలు తిప్పుతున్న వడిసెలల ఝుంకారాల్లో చెంచన్నలు సవరన్నలు ఎత్తిపట్టిన గండ్రగొడ్డళ్ళ పదునుల్లో చిత్రహింసాశాలల్లో చితికిన పెదవుల వెనుక దాగిన రహస్యాల్లో పీలికలైపోయిన మాంసపుతునకల్లో ఆర్తిగా తడుముకునే పచ్చి జ్ఞాప

కాళ్లో గుండెలమీద విరుస్తున్న మంకెన పువ్వెరుపుల మెరుపుల్లో విరబూస్తున్న దండ కారణ్యపు లేతెరుపు చివురుల్లో రెపరెపలాడుతున్న

ఎర్రజెండా ! నీకు లాల్ సలామ్ !
పోరాటాల లాల్ సలామ్ !!! ఆరాటాల లాల్ సలామ్ !!

## II

నేనిప్పుడు విశాలమైన నదిని.
వీరుల శ్వాసలతో ఉప్పొంగి
శ్రామికుల స్వప్నాలతో పోటెత్తి
ఉరుకు లెత్తుతున్న లోతైన నదిని.
ఊపిరి ఒడ్డుల నొరుసుకుంటూ పారే
ప్రవాహాన్ని, ప్రభంజనాన్ని నేను,
ఎండిన ఎదల్లోంచి ఉరికే
జలపాతాన్ని, జనయుద్ధాన్ని నేను,
జనమై వెల్లువెత్తిన
జగిత్యాల జైత్రయాత్రను నేను,
నెత్తుటి మైలురాయై
నిలిచిన ఇంద్రవెల్లి స్థూపాన్ని నేను,
కోమురం భీం వారసుడెత్తిన
పోరు పతాకాన్ని నేను,
అరణ్యాల్ని కుదిపి యుద్ధరంగాల్ని చేసిన
తుడుం మోతను నేను !
పిల్లకాలువగా పుట్టి
విశాలమైన నదినై –
పల్లెల్లో, పట్టణాల్లో,
ఎడారి మైదానాల్లో,
కారడవుల్లో, పర్వతశ్రేణుల్లో
బతుకెండిన గుండెల్లో,
నెత్తుటి నరాల రహదారుల్లో

నేను పోటెత్తుతూనే వున్నాను
నేను పోరు మొలకలవుతూనే వున్నాను !

నేను జీవజలాన్ని, ధరిత్రి మూలాధారాన్ని,
సాగునీటిని, సమస్తాన్ని,
యంత్రాల్ని తిప్పే వేడి నీటి ఆవిరిని,
తరాల దాహం తీర్చే దప్పికని,
కలాలు విరజిమ్మిన కవోష్ణ గీతికని,
కణీల్మన్న కాలిగజ్జెల కదన నాదాన్ని,
తప్పెటమీద మ్రోగిన బడుగు జనం బతుకు పాటని,
చీకటి కమ్మిన జీవితాలకు వెలుగు బాటను,
సమస్త జీవకోటికి ప్రాణదాతను.
నేను నాగరీకతల్నీ, మానవ విలువల్నీ
ఒరుసుకుంటూ పారుతున్న
విశాల నదీ ప్రవాహాన్ని
అపార జనసమూహాన్ని !

నా ప్రవాహాన్ని, నా ప్రకాశాన్ని చూసి
బిత్తరపోయాడు శత్రువు
బెంబేలెత్తిపోయాడు శత్రువు
నన్ను పిడికిట పట్టి బంధించాలని చూశాడు
సాధ్యంకాక
నిర్బంధపు నిషేధపు ఆనకట్టలు కట్టి నా నడకను ఆపాలనుకున్నాడు
వాడొట్టి మూర్ఖుడు !
విద్యుత్తై దూకే జలపాతాన్నాపడం ఎవడి తరమూ కాదు.
వాడు కట్టిన నిర్బంధపు నిషేధపు ఆనకట్టలు నన్నెన్నాళ్ళు ఆపగలవ్ ?
పరిశ్రమల్లోని సామాన్య కార్మికులు,
పంటపొలాల్లోని రైతుకూలీలు,
విద్యార్థులు, మేధావులు
నా అలలు,

నా పదును కలలు.

వాళ్ళు నా ముద్దుబిడ్డలు
వాళ్ళే నా పథ నిర్దేశకులు.

వాళ్ళు ఈ నిర్బంధపు నిషేధపు ఆనకట్టల బంధనాలు బ్రద్దలుకొట్టి
నన్ను విడుదల చేస్తారు
విముక్తి దిశగా నడిపిస్తారు
పోరు హోరై నినదిస్తారు.

చాప క్రింద నీరులానో
తెరచాప లెత్తిన నావలానో
నేనన్నిచోట్లా వున్నాను

కొంగు నడుముకు చుట్టి కోతలు కోస్తున్న
చెల్లెళ్ళ పిడికిట బిగిసిన వంకీ కొడవళ్ళ కసి పదును
మెరుపుల్లో నేనున్నాను,
కర్మాగారాల్లో తిరుగుబాటు బావుటానెత్తిన
కార్మికుల చేతుల్లో బిగిసిన సమ్మెట పిడుగునై నేనున్నాను,
ఊరవతల వెలివేయబడ్డ అంటరాని గుడిసెల్లో
రగులుతున్న ఆత్మగౌరవ జ్వాలనై నేనున్నాను,
దున్నేవాడిదే భూమని ప్రకటించి
భూస్వాముల భూముల్లో రగల్ జెండా లెగరేసిన ధిక్కారాల్లో నేనున్నాను,
మట్టిపొరల్లో దాగిన బొగ్గును స్వేదంతో దట్టించి
మందు పాతర్లగా పేల్చిన యుద్ధ తంత్రాల్లో నేనున్నాను,
చేలల్లో, చెలకల్లో, చివురుల్లో, గుబురుల్లో
పాటల్లో, ఆటల్లో, మువ్వల్లో, మూగగుండెల్లో
బోసినవ్వుల్లో, పండు వెన్నెల్లో, పగటి వెలుగుల్లో,
తూరుపు ఎరుపుల్లో నేనున్నాను
తూరుపు ఎరుపునై నేనున్నాను.

ఎన్నో వ్యూహాలతో, ఎత్తుగడలతో
సరికొత్త ప్రణాళికలతో

ఎప్పటికప్పుడు సరిదిద్దుకునే తీర్మానాలతో
యుద్ధమై రాటుతేలుతూ
యుద్ధరంగాన్నై విస్తరిస్తున్న
నేను చిరస్వప్నాన్ని
నేను స్థిర లక్ష్యాన్ని !

ఇక ఇప్పుడు
వసంత మేఘం కరిగి కురుస్తుంది,
తీగ మెరుపు తళుక్కుమంటుంది.
జల్లులు జల్లులై వరద కమ్ముకొస్తుంది
ఇక శత్రువు చెక్కలాకులు చిట్లిపోతాయ్,
వాడి మట్టి కోటలు కూలిపోతాయ్,
ఠాణా కేంద్రాలు జలసమాధులౌతాయ్ !

ఒడిదుడుకుల ఎదురీతల
అనుభవాల అడుగులతో
వరద కెరటాల ఉగ్ర గీతాలతో
సాగిపోతున్న నదిని నేను
విముక్తి మహా ప్రవాహాన్ని నేను
నెత్తుటి నినాదాన్ని నేను !

* * *

పక్షులే పంజరాలై ఘనీభవిస్తున్న ఈ మహా విధ్వంసక దృశ్యంలో మానవతా పతాకాలై సమున్నతంగా రెపరెపలాడుతుందెవరు ? హోరెత్తి సాగే సాగరం సైతం ఆకాశపు నీలిమల్లో ఇంకిపోతున్న ఈ భయోద్విగ్న సన్నివేశంలో జనకెరటాలై సగర్వంగా తలయెత్తుకు నిలిచిందెవరు ? మందుపాతర్ల లో కూరిన జెలిటిన్ మౌనంలో కడుపుతీపుల్నీ కన్నీటి జోలల్నీ కసి మంటలుగా మండించిందెవరు ? అన్నలూ ! అమరులూ ! మీకు ఎర్రెర్ర దండాలు !! ఓ ఉగ్రమూ ఓ ప్రాచీనమూ ఓ మానవ స్వప్నం ఓ ఇతిహాసం ఓ విశ్వజనన రహస్యం— ప్రతిదీ ముడివీడని ప్రశ్నై వేధిస్తుంటే ప్రతీ విలువా మృతప్రాయమైపోతుంటే సజీవత నిస్తూ అనంత చలన శక్తితో సజీవంగా ఒకచే ఒక్కటి సముద్రం ! ఓ సముద్రమా ! నీ చివరి చిరునామా ఏమిటి ? యుద్ధంలో ఆయుధం అలీనం కాకూడదు, భాషలో భావం అలీనం కాకూడదు

ఆదమరిస్తే పీకలు తెగిపోయే సన్నివేశంలో యుద్ధమై లీనమవ్వడమే అసలైన యుద్ధతంత్రం. శ్వాస సైతం యుద్ధమై రాటు తేలుతున్న తరుణంలో ఈ నేలకు సరికొత్త పునాదిని స్వప్నిస్తూ సృష్టిస్తూ సముద్రమొకటే ! సముద్రాన్ని చూసినవాడు, స్వప్నించినవాడు సముద్రంలో మునిగి నిలువెల్లా పదునెక్కినవాడు వాడు వీరుడు, వాడు విలుకాడు, వాడు నా చెలికాడు ! ఈ విశ్వం వాకిట రేపు విరబూసే తొలి పొద్దుల్లో ఎగిరే శ్రామికజన పతాకమా ! లాల్‌సలామ్ !!

## III

నేనికపై మహాసముద్రాన్ని
అఖండ శక్తిశాలిని
అంతర్జాతీయ గీతాన్ని
విశ్వాన్ని ముంచెత్తే పోరు కెరటాన్ని
పీడిత ప్రజాసాయుధ సైనికుడ్ని
సైన్యాధిపతిని.
నేను మొదట శ్రీకాకుళమై చిగురించిన నగ్జలబరిని
నిన్న త్యాగాల రహదారుల్లో తుపాకులెత్తిన తెలంగాణాని
విముక్తిప్రాంతమై మొలకెత్తుతున్న దండకారణ్యాన్ని
ఇప్పుడు దేశమంతా విస్తరిస్తున్న లాంగ్ మార్చ్‌ని
రేపు ఎర్రజెండానై మెరిసి విరిసే బోల్షివిక్‌ను.

సామ్రాజ్యవాదపు యుద్ధ శకటాల్నీ, అణ్వస్త్రాల్నీ,
నా దేశాన్ని అమ్మకపు సరుకు చేస్తున్న వ్యాపార నౌకల్నీ,
సామ్యవాద వ్యతిరేక జలాంతర్గాముల్నీ
నేను వాయుగుండమై ముంచేస్తాను.
మట్టికాళ్ళ మహారాక్షసుల్నీ
కొయ్యగుర్రాల్నీ పునాదులతో సహా
సమూలంగా పెకలించి పారేస్తాను.
ప్రపంచవ్యాప్తంగా జాతుల్ని విముక్తి చేసి
శ్రామికరాజ్య స్థాపన చేయడానికి

అశేష ప్రజాబలపు అలల్తో
దండెత్తుతున్న పెనుమంటని,
పెనుతుఫాన్ని నేను
నేను విప్లవాన్ని
నేను సముద్రాన్ని !
ఇప్పటిదాకా ఘనంగా కీర్తించబడుతున్న
ఈ కుళ్ళు సమాజంలోని
అసమానత్వాన్ని, అసహజత్వాన్ని
పురుషాహంకారాన్నీ, మతోన్మాదాన్నీ
సమస్త చైతన్య నిరోధకాల్నీ
సమూలంగా కడిగిపారేసే
సముద్రాన్ని నేను
విప్లవాన్ని నేను
వర్గ పోరాటాన్ని నేను
పీడిత ప్రజల చుక్కానీను నేను
నక్సలబరిని నేను
బోల్షవిక్ని నేను
లాంగ్మార్చ్ని నేను
రాజ్యాధికారాన్ని నేను
విముక్తిగీతాన్ని నేను
విశ్వసంగీతాన్ని నేను

నాకు తెలుసు
సమస్త అవహేళనలను అపహాస్యం చేస్తూ
తొలి విజయగర్జనైన అరోరా మరఫిరంగి ధ్వని మరోమారు
ప్రతిధ్వనిస్తుంది
దిక్కుల్ని మీటిన క్రెమ్లిన్ గంటానాదం మరోమారు
మారుమ్రోగుతుంది
ఘనీభవించిపోయిన యాంగ్సీనది మరోమారు

పోటెత్తి ప్రవహిస్తుంది
నాకు ఖచ్చితంగా తెల్సు
ఎగురుతున్న ఎర్రజెండాల రెపరెపల్తో
ఈ విశ్వమంతా ఎర్రబారుతుంది !
నేను సముద్రాన్ని
నేను విప్లవాన్ని
నేను జాతుల విముక్తి గీతాన్ని
అంతర్జాతీయ శ్రామిక పతాకాన్ని !
మార్క్స్ ఎంగెల్స్ ప్రవచించిన కమ్యూనిజాన్ని,
లెనిన్ స్టాలిన్‌లు ఈ ప్రపంచం నుదుట చెక్కాలనుకున్న
సోషలిజాన్ని,
మావో మహాశయుని ఆలోచనల్లో ఊపిరి పోసుకున్న
సాంస్కృతిక విప్లవాన్ని సాధించే
నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని నేను
మహాసముద్రాన్ని నేను
విశ్వం వాకిట ఎర్రజెండా నెగరేసే
విప్లవ మహాసముద్రాన్ని నేను !

('వెన్నెల'కు కృతజ్ఞతాభివందనాలు)

—అనామధేయుడు

---

# ఎవరు అభివృద్ధి నిరోధకులు ?

తెలంగాణాలో నక్సలైట్లు ఉన్నందువలననే అభివృద్ధి జరగడం లేదని, నక్సలైట్లు అభివృద్ధి నిరోధకులని కేంద్ర హోంమంత్రి నుండి పోలీసు అధికారుల వరకు పదేపదే విషం గక్కుతున్నారు. అయితే 'అభివృద్ధి' అంటే ఏమిటి ?

ప్రజలు శ్రామికవర్గ భావజాలంతో పునాది నుండి (from below)అభివృద్ధిని కాంక్షించడం సరైనదా ? లేక పాలకవర్గాలు తమ ప్రయోజనం కోసం పై నుండి (from above) ప్రజలపై రుద్దే అభివృద్ధి సరైనదా ? ఇప్పటిదాకా మనదేశంలో జరిగింది రెండవదే. ఇప్పుడిప్పుడే విప్లవ శక్తులు ప్రజల సహకారంతో, ప్రజల అనుభవ జ్ఞానంతో అభివృద్ధి కార్యక్రమాలు చేపడుతున్నాయి. ఇది విప్లవోద్యమం లోనే ఒక గొప్ప మలుపు. ఈ అభివృద్ధి కార్యక్రమాలద్వారా ప్రజలకు కావలసిన కనీసవసతులు సాధించుకొంటున్నారు. రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలను అమలు జరుపుకొంటున్నారు.

అయితే కొద్దిమంది మధ్యతరగతి మేధావులకు యిది 'అభివృద్ధి'గా కనపడడం లేదు. ఇదంతా 'రాజకీయ హింసతో కూడిన అభివృద్ధి'గా కనబడుతూ వుంది. విప్లవ కారులకు—ప్రజల మనోభావాలకు మధ్య అగాధం వున్నట్లు, విప్లవకారులు బలవంతంగా ప్రజలపై తమ వ్యూహాలు, ఎత్తుగడలను రుద్దుతున్నట్టు సిద్ధాంతాలు చేస్తున్నారు. ఈ పనిని పత్రికలు, పోలీసులు, జనజీవన స్రవంతిలో వున్న రాజకీయ పార్టీలు ఎప్పటినుండో చేస్తున్నాయి. కాబట్టి సామాజిక మార్పు కోరేవాళ్ళు ఆ పని తమ భుజాన వేసుకోవలసిన అవసరం లేదు. అయితే దళారీ ప్రభుత్వాలు, బహుళ జాతి కంపెనీలు, భూస్వామ్య శక్తులు తీసుకువచ్చే "అభివృద్ధి", అందులో నుండి పుట్టే హింసను, దాని ప్రమాదాన్ని గుర్తించవలసిన అవసరం వుంది. ప్రజలచే గుర్తింపచేయవలసిన అవసరం వుంది.

తెలంగాణా జిల్లాలలో ప్రజలు నక్సలైట్ పార్టీల సహకారంతో తమ గ్రామాల అభివృద్ధిని ఎలా నిర్వహించుకొంటున్నారో వివరించే రిపోర్టే ఈ వ్యాసం.

గత సంవత్సరం (1996) వరంగల్ జిల్లా పీసర గ్రామంలో "లింగం" అనే యువకుడిని పోలీసులు పట్టుకొనిపోయి ఎన్‌కౌంటర్ పేరిట కాల్చి చంపారు. దీనిపై వాస్తవాలు సేకరించడానికి వెళ్ళిన మాకు లింగం ఆధ్వర్యంలో గ్రామ అభి

వృద్ధి కమిటి చేసిన కార్యక్రమాలను ప్రజలందరూ వివరించారు. ఒక గ్రామ అభివృద్ధి కమిటిసభ్యుడు కలిసి గ్రామంలో తాము ఎవరెవరి దగ్గిర పన్నులు వసూలు చేసింది, తాము చేసిన కార్యక్రమాలను, భవిష్యత్ కార్యక్రమాలను వివరించారు. తమ గ్రామంలో గ్రామ రాజ్య కమిటీ 7 మందితో 1995లో ఏర్పడిందని ఈ గ్రామ రాజ్య కమిటి ఆజమాయిషిలో గ్రామ న్యాయ వ్యవస్థ, గ్రామ అభివృద్ధి కమిటి, గ్రామ రక్షక దళం ఉంటుందని వివరించారు. గ్రామ అభివృద్ధి కమిటీ గ్రామాభివృద్ధిని దృష్టిలో ఉంచుకొని రెండు సంవత్సరాల కోసం కార్యాచరణ పథకాన్ని రూపొందించుకుంది. నిధుల కోసం తాము మూడు రకాల మార్గాలను ఎన్నుకున్నామని చెప్పారు. ప్రజలకు వ్యతిరేకంగా ఉన్న తిరుపతిరెడ్డి అనే భూస్వామి పంటను పూర్తిగా కోసుకొని ధాన్యాన్ని అమ్మగా వచ్చిన నిధులూ, గ్రామంలో కొందరు వ్యాపారులు, భూస్వాములు అయ్యప్ప గుడికోసం సేకరించిన నిధులూ స్వాధీనం చేసుకొన్నారు. ప్రభుత్వంపై వత్తిడి తెచ్చి మరికొన్ని నిధులు సాధించుకున్నారు. ఈ విధంగా మొత్తం తాము 95 వేల రూపాయల నిధులు పోగు చేసుకున్నామని చెప్పారు.

7 వేల జనాభా ఉన్న పీసరలో విద్యార్థులకు హైస్కూల్ లేదు, గ్రామ అభివృద్ధి కమిటీ హైస్కూల్‌కు పాఠశాల స్థాయిని పెంచడం కోసం 8, 9 తరగతుల కోసం ప్రభుత్వానికి డబ్బు కట్టి పాఠశాలను అప్‌గ్రేడ్ చేసుకున్నారు. ప్రభుత్వం టీచర్లను నియమించనందున గ్రామ అభివృద్ధి కమిటీనుండి ఐదుగురు టీచర్లను నియమించారు. పాఠశాలకు అదనంగా మూడు తరగతి గదులను నిర్మించారు. పాఠశాలకు చుట్టూ కాంపౌండ్ నిర్మించారు పాఠశాలలో మంచినీటి కోసం బోరువేసి దానికి కరెంట్ మోటర్ బిగించారు.

గ్రామంలో మంచినీటికి కటకటగా ఉంది. అంతకు ముందు రోజ్‌గార్ నిధుల నుండి రక్షితనీటి పథకం క్రింద బోరు వేశారు. ఆ బోరులో మోటర్ కూరుక పోయి బోరు నిరుపయోగం అయింది. గ్రామంలో "మినీ ట్యాంకులు" ఉన్నా అవి నిరుపయోగం అయ్యాయి. గ్రామ అభివృద్ధి కమిటీ మంచినీటి కొరత తీర్చడం కోసం తిరుపతిరెడ్డి (భూస్వామి) బావిని స్వాధీనం చేసుకొని అక్కడ నుండి ట్యాంకుల వరకు పైప్ లైన్‌వేసి ప్రజల మంచినీటి ఎద్దడి తీర్చారు. సంవత్సరం తర్వాత రోజ్‌గార్ నిధులనుండి వేయించిన బోరులోనుండి మోటర్‌ను బయటకు

తీయించి, కొత్త మోటర్ బిగించారు. ఆ బోరు ద్వారా వచ్చే నీటిని ప్రజలు వాడుకుంటున్నారు. ప్రస్తుతం గ్రామంలో నీటి ఎద్దడి లేదు.

ప్రజల వద్దకు పాలన కోసం అధికారులు గ్రామంలోకి వస్తే వారిని నిలదీసి బస్టాండ్ మంజూరు చేయించుకున్నారు. మేము గ్రామానికి వెళ్ళినప్పుడు ప్రజలు శ్రమదానం చేస్తున్నారు. బస్టాండు నిర్మాణంలో ఉంది. ఈ బస్టాండు నిర్మాణానికి ప్రభుత్వంతో 30 వేలు మంజూరు చేయించుకున్నారు. పశువుల డాక్టరు సక్రమంగా రానందున, పశువులకు సంబంధించిన మందులు లేనందున అనేక పశువులు చనిపోయాయి. గ్రామ అభివృద్ధి కమిటి సక్రమంగా రావాలని డాక్టర్‌ను హెచ్చరించింది. 15 వందల రూపాయల మందులు కొని ఆసుపత్రిలో ఉంచారు. ప్రజలకు కూడ వైద్య సహకారం అందకపోవడం వల్ల గ్రామ అభివృద్ధి కమిటీ నుండి 30వేలు ఖర్చుపెట్టి మెడికల్ క్యాంపు జరిపారు. ఎలక్ట్రికల్ ఏ.ఇ.ని నిలదీసి గ్రామంలో అవసరం ఉన్నచోట వీధి దీపాలను ఏర్పాటుచేశారు.

బ్యాంకులు సాధారణ ప్రజలకు అప్పులు ఇవ్వనందువలన రైతులు వడ్డీ వ్యాపారులనో, ఫైనాన్స్ కంపెనీలనో అప్పుల కోసం ఆశ్రయించవలసిన దుస్థితి ఏర్పడింది. ఈ పరిస్థితి తెలంగాణా అంతటా వుంది. రైతులు గురవుతున్న ఈ దోపిడీని నివారించడం కోసం గ్రామ సొసైటీని ఏర్పాటు చేసి రైతులకు తక్కువ వడ్డీకి అప్పులు ఇచ్చారు. ఎరువుల అమ్మకంలో వ్యాపారులు రైతులను దోచుకుంటున్నారని తెలిసి గ్రామ సహకార సంఘాన్ని ఏర్పాటుచేసి, ఎరువులను కొని ఎటువంటి లాభం లేకుండా రైతులకు విక్రయించారు. సుమారు మూడు లక్షల రూపాయల విలువ చేసే ఎరువులను విక్రయించారు.

తాము మురికి కాలువలను గ్రామంలో తవ్వించడానికి గ్రామ సర్పంచ్‌తో చర్చిస్తుండగా పోలీసులు వచ్చి 'లింగం'ను ఎత్తుకొనిపోయి కాల్చి చంపారని లింగంపై ఎటువంటి కేసులు లేవని మా గ్రామాన్ని అభివృద్ధి చేసుకొనడమే ప్రభుత్వానికి నచ్చలేదని అందువలననే లింగంను చంపారని ఆయన అన్నారు. ఆయనొక సాధారణ రైతు. ఏ ఇంజనీయర్, ఏ ప్రణాళిక సంఘం వారికి అవసరం లేకుండానే, తమ గ్రామాన్ని తాము అభివృద్ధి చేసుకొనడానికి వారు సిద్ధమవుతున్నారు.

ఇది పీసర్లో ఒక్కటే కాదు ఉత్తర తెలంగాణలోని చాల పల్లెల్లో పరిస్థితి ఇదే. నిజామాబాద్ జిల్లా సదాశివనగర్ మండలం రామిరెడ్డిపల్లి గ్రామంలో ప్రజలను చైతన్యవంతులను చేయడం కోసం గ్రామ అభివృద్ధి కమిటీ లైబ్రరీని నిర్మించింది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి భవనాన్ని, విద్యార్థుల కోసం హాస్టల్ భవనాన్ని, మహిళల కోసం కమ్యూనిటీ హాల్‌ను, బస్‌షెల్టర్‌ను నిర్మించారు. కరీంనగర్ జిల్లా మద్దిమల్ల, వీర్నపల్లి గ్రామాల మధ్య ఉన్న "రాయిణి చెరువు"కు ఎన్నో సంవత్సరాల క్రింద గండిపడి నీరు నిలువక పంటలు పండడం లేదు. ప్రభుత్వం చుట్టు, రాజకీయ నాయకుల చుట్టు ప్రజలు తిరిగి అలసిపోయి చివరకు గ్రామ అభివృద్ధి కమిటీని ఏర్పాటు చేసుకొని ఆరు నెలలపాటు ప్రతిరోజు 561 మంది పని చేసి చెరువు గండి పూడ్చి చెరువు కట్ట ఎత్తు పెంచారు, ఇంజనీర్ల అంచనా ప్రకారం ఈ పని విలువ కోటి రూపాయలు. ఈ గ్రామస్థులకు ఏ ప్రభుత్వ శాఖ సహాయపడ లేదు.

ప్రతిరోజు నక్సలైట్లు అభివృద్ధి నిరోధకులని మాట్లాడే రాష్ట్ర హోంమంత్రి మాధవరెడ్డిది నల్గొండ జిల్లా భువనగిరి నియోజక వర్గం. ఈ నియోజక వర్గంలో ఒక పెద్ద మండల కేంద్రం చౌటుప్పల్. హైదరాబాద్ - విజయవాడ జాతీయ రహదారిపై ఉంటుంది.

చౌటుప్పల్‌లో తీవ్రమైన మంచినీటి ఎద్దడి. దగ్గరలో ఎక్కడ మంచి నీరు లభించదు. గ్రామం ఏర్పడినప్పటి నుండి ఇదే పరిస్థితి. అభివృద్ధి కాముకులమని చెప్పుకొనే మాధవరెడ్డి ఇక్కడ నుండి 4 సార్లు శాసన సభ్యుడిగా ఎన్నిక అయ్యాడు. ప్రతి ఎన్నికలోను ఆయన వాగ్దానం చౌటుప్పల్‌కు మంచినీటి ఎద్దడి తీరుస్తాననే. ప్రజలు ఆశతో ఆయన చుట్టూ సంవత్సరాల తరబడి తిరిగారు. ఆయన వాగ్దానం వాగ్దానంగానే మిగిలిపోయింది. ప్రజలు మంత్రిమీద నమ్మకం కోల్పోయి నక్సలైట్ల సహకారంతో అఖిలపక్ష కమిటీని ఏర్పాటు చేసుకొని 17 లక్షల నిధులను సేకరించారు. ఆరు కిలోమీటర్ల దూరంలో బోరింగులు వేయించి అక్కడ నుండి చౌటుప్పల్ వరకు పైప్‌లైన్ వేసి చౌటుప్పల్‌లో ట్యాంకు నిర్మించి ప్రజలకు మంచినీరు సరఫరా చేశారు. ఉప్పునీరు తప్ప మంచినీరు దొరకని చౌటుప్పల్‌లో నేడు మంచి నీటి ఎద్దడి లేదు. అభివృద్ధి నిరోధకులని గొంతు చించుకొని అరుస్తున్న హోంమంత్రి

చౌటుప్పల్‌కు పోతే నక్సలైట్ల సహకారంతో సాధించుకొన్న రక్షిత నీటి పథకం నీరు తాగాల్సిందే.

ఇదే హోంమంత్రి నియోజక వర్గంలో "కంచె భూములని" ఐదువేల ఎకరాల భూములు ఉన్నాయి. కోస్తా ప్రాంతం నుండి స్వాతంత్ర్యానికి పూర్వం వచ్చి కొందరు భూస్వాములు స్థిరపడ్డారు. భూ సంస్కరణల చట్టం వారి భూములను ఏమీ చేయలేకపోయింది. దాదాపు ఒక్క కుటుంబం చేతిలోనే ఈ భూమి అంతా వుంది. ఈ భూమిని పేద ప్రజలకు పంచాలనే డిమాండ్ చాలాకాలం నుండి ఉంది. మాధవరెడ్డి ప్రతిసారీ భూమి పంచుతానని హామీ ఇస్తూనే ఉన్నాడు. చివరకు ప్రజలు మంత్రిపై నమ్మకం కోల్పోయి అఖిలపక్ష కమిటీని ఏర్పాటు చేసుకొని భూమిలేని వారందరి లిస్టు తయారుచేసుకొని భూమి పంచుకున్నారు. ఈ భూపంపకంలో తాను ఉండకపోతే ప్రజలు ఏమనుకుంటారోనని నక్సలైట్లతో ఏర్పాటు చేయబడిన అఖిలపక్ష కమిటీలో తాను కూడ ఉండి భూమి పంపిణీ చేసి ఆ భూమికే పేద ప్రజలకు పట్టాలు కూడ ఇప్పించారు. చౌటుప్పల్ ప్రాంతంలోకి పోయి నక్సలైట్లు అభివృద్ధి నిరోధకులని మాట్లాడితే మంత్రికి ప్రజలే సరియైన సమాధానం చెబుతారు. ఈ అభివృద్ధి కార్యక్రమాలకు కారకుడైన జనార్థన్ అనే నక్సలైట్ దళ నాయకుడిని గత సంవత్సరం అక్టోబరులో హైదరాబాదులో అరెస్టు చేసి ఎన్‌కౌంటర్ పేరిట కాల్చి చంపారు.

— టి. పురుషోత్తం

---

గల్పిక :

# గోచిగుడ్డ

ఎస్.ఐ : "ఎమ్ 304 వాడ్ని కాల్చేయ్ !"

కానిస్టేబుల్ : "వాడ్ని ఎలా కాల్చటం సార్, చిన్న పిల్లాడు."

ఎస్.ఐ : "లం.... వాడ్ని పిల్లోడు అంటావా ? నక్సలైట్ రా కాల్చేయ్ !"

కానిస్టేబుల్ : "ఊరుకోండి సార్, పిల్లోడ్ని నక్సలైట్ అని ఎలా కాల్చడం ?"

ఎస్.ఐ : "ఏం.... ఈ తెలంగాణాలో పుట్టిన పసిగుడ్డు కూడా నక్సలైటేరా ! చిన్న పామునైనా పెద్ద కర్రతోనే కొట్టాలి. వాడు చూడు బొక్కబోర్లా పడ్డాడు. కాల్చేయ్ !

కానిస్టేబుల్ : "పాపం చిన్నోడండి".

ఎస్.ఐ : "కుక్క, వాడు అలా పడ్డాడంటే ఎదురుదాడి చేయబోతున్నాడనిరా !"

కానిస్టేబుల్ : "దాడి చేయటానికి వాడి దగ్గర గోచిపీలిక తప్ప ఇంకేం లేదుకదా !"

ఎస్.ఐ : తెలివితక్కువోడా, ఆ గోచీనే వాడు ఆయుధంగా చేసి మన పీకలు పిసికి చంపుతాడు. దీనినే గెరిల్లా పంథా అంటారురా !

కానిస్టేబుల్ : అవునా ! సార్ గోచీగుడ్డ కూడా గెరిల్లా పంథాలో ఆయుధంగా మలచబడితే మన ఆయుధాలు ఎందుకు పనికొస్తాయ్ ?

ఎస్.ఐ : అవున్రా బుర్రలేనోడా, వాడు దాడి చేయకముందే మనం ఎదురుదాడి చేయాలి. వాడ్ని కాల్చేయ్ !

కానిస్టేబుల్ : అలాగే సార్ ! ధన్.... ధన్.... ధన్....

* * * *

కానిస్టేబుల్ : నాదో చిన్న అనుమానం సార్.

ఎస్.ఐ : ఏందిరా అది చెపలపోడా ?

కానిస్టేబుల్ : ఈ పిల్లగోడు నక్సలైట్ అని ఎలా గుర్తించారు సార్ !

ఎస్.ఐ : అది చాలా తేలికరా.

కానిస్టేబుల్ : అంత తేలిక పని నాకూ చెప్పండి సార్ !

ఎస్.ఐ : వాడి మొలకి ఉన్న ఎర్రగుడ్డని చూసిరా దద్దమ్మా

కానిస్టేబుల్ : ఆఁ....!

— అకువ

కత్తులూ - కాంతులూ :

## కేరళ హైకోర్టు ప్రజా వ్యతిరేక తీర్పు

న్యాయ వ్యవస్థ క్రియాశీలత పరిధి రాను రాను విస్తరించడాన్ని చూసి ఆనందడోలికల్లో తేలియాడే బుద్ధిజీవులకు కేరళ హైకోర్టు తీర్పు న్యాయవ్యవస్థ చీకటి కోణాన్ని కొంతైనా తెలియజేస్తుంది. ప్రస్తుతం పత్రికల నిండా ఒకటే చర్చ. న్యాయవ్యవస్థకు పరిపాలనా వ్యవస్థకు మధ్యన కొనసాగుతున్న ఘర్షణ గూర్చి లేదూ న్యాయవ్యవస్థ పరిపాలన వ్యవస్థ మీద ఆధిపత్యం సాధించి ఎలా దాన్ని సంస్కరించే దిశగా ముందుకు వెళ్తుందని. ఒక హవాలా, ఒక టెలిస్కామ్, ఒక పశుగ్రాసం లాంటి కుంభకోణాలెన్నో న్యాయవ్యవస్థ క్రియాశీలత వల్లే బయటపడ్డాయని, రాజకీయపరమైన అవినీతిపై న్యాయవ్యవస్థ ఒక అంకుశంలా పనిచేస్తుందనే బూర్జువా పత్రికల 'హనుమాన్ చాలీసా'లను కాస్త ప్రక్కన పెట్టి న్యాయవ్యవస్థ కదలికలపై నిఖార్సయిన నిఘా అవసరం. అలాగే ఆ కదలికల వెనుక నున్న స్వార్థ ప్రయోజన కాంక్షను డేగకన్నుతో పరిశీలించడం అవసరం. ఇంతకీ న్యాయ వ్యవస్థకున్న స్వార్థ ప్రయోజన కాంక్ష ఏమిటి అని గనుక ప్రశ్నించుకున్నట్లయితే ఒక వాస్తవం బోధపడుతుంది.

యాభై ఏళ్ళ ఘన స్వాతంత్ర్యం తమకు ఏ ప్రయోజనం సాధించి పెట్టింది. ఏ ప్రయోజనం సాధించిపెట్టలేదు అనే తార్కికమైన అవగాహనకు ప్రజలు ముఖ్యంగా పీడితులు వస్తున్న కాలం ఇది. పర్యవసానంగా ప్రజల్లో రాజ్యం పట్ల దాని విధానాల పట్ల ఏవగింపు అదే సందర్భంలో తిరుగుబాటు చైతన్యం పట్ల అభిమానం వెల్లువెత్తుతుంది. రాజ్యం పూర్తిగా విశ్వాస రహిత స్థితిలో పడిపోయింది. ఇలాంటి నేపథ్యంలోనే రాజ్యాన్ని రక్షించుకోవడానికి తమదైన బూర్జువా మార్కు ప్రజాస్వామ్యాన్ని భద్రపరుచుకోవడానికి టి. యన్. శేషన్, అన్నా హజారే, జి. ఆర్. ఖైరార్, జయప్రకాష్ నారాయణ ('ఈనాడు' కాలమిస్ట్) లాంటి వారు బయలుదేరుతారు.

ఇదే కాలంలో ప్రభుత్వ అంగాలలో మూడోదైన న్యాయవ్యవస్థ తన ప్రభుత్వాన్ని కాపాడటానికి ముచ్చటైన పనులకు శ్రీకారం చుడుతుంది. "సక్రమమైన న్యాయపాలన ప్రజలకు ప్రభుత్వం మీద విశ్వాసాన్ని పెంపొందిస్తుంది" అంటాడు న్యాయశాస్త్ర మేధావి లార్డ్ బ్రైస్ (Lord Bryce). ఈ నిర్వచన నేపథ్యం నుండి చూసినపుడు ప్రజలకు ప్రభుత్వం మీద విశ్వాసం కలగాలంటే,

దానిపై తిరుగుబాటు చేయకుండా ఉండాలంటే న్యాయం, ధర్మం అనేవి నాలుగు పాదాల మీదే నడుస్తున్నాయనే అనుభూతిని ప్రజలకు కల్పించాలి. నిజానికి ఇప్పటి వరకు కూడా మన న్యాయవ్యవస్థ చేస్తున్నదిదే !

ఎర్నాకుళం వాణిజ్య మండలి 1994లో వేసిన పిటీషన్‌కు కరుణించిన కేరళ న్యాయస్థానం ఇటీవల బంద్‌లను, ఇతర నిరసన ప్రదర్శనలను నిషేధిస్తూ ఒక తీర్పు వెలువరించింది. ఈ ప్రజాస్వామ్య (?) దేశంలో ప్రజలకు కనీసం తమ నిరసన హక్కు కూడా ఉండకూడదనేది కేరళ హైకోర్టు తీర్పు సారాంశం. 1992 ఆగస్ట్ 15 రోజున ఎర్రకోట నుండి ప్రసంగిస్తూ ఆనాటి ప్రధానమంత్రి 'స్కాము'లపర్తి నరసింహా రావు 'మారటోరియం'మంత్రాన్ని జపించాడు. ఆయన ప్రకారం, ప్రదర్శనలు, సమ్మెలు, పోరాటాలపై నిషేధం లేదా 'మారటోరియం' విధించినట్లయితే దేశం ఇక చచ్చినట్లుగా ముందుకెళ్తుంది !

పరస్పరం కలహించుకున్నట్లుగా కనిపించే రాజకీయ, న్యాయ వ్యవస్థల అభిప్రాయాలు ఇసుమంత తేడా లేకుండా ఒకటిగా కనిపించడం యాదృచ్ఛికం మాత్రం కాదు ! వారు కలలు కంటున్నారుగాని నిజానికి ప్రజలపై వారి ప్రాథమిక హక్కు అయిన నిరసన తెలిపే హక్కుపై నిషేధం లేనిది ఏ రోజు ?!. ఏ నిషేధం లేకుండానే విజయనగరం జూట్ మిల్లు కార్మికులు, కాల్దరీ రైతులు తమ నిరసన స్వరం వినిపించిన నేరానికి 'ఖాకీ' తోలు కప్పుకున్న ఈ రాజ్యంచేత అత్యంత నిర్దాక్షిణ్యంగా కాల్చివేయబడతారు.

మన నిరసన హక్కుపై అప్రకటిత నిషేధం ఉందనడానికి ఇంతకు మించిన ఉదాహరణలు అవసరమా ?!. ప్రజా పోరాటాలను అణచివేయడానికి బ్రిటీష్‌వారు రూపొందించిన 'రూల్స్' యథాతథంగా మన చట్టాలను అలరిస్తూనే ఉన్నాయి. అందుకే మనమేదైనా ప్రజా సమస్య మీద గొంతు ఎత్తబోతే 144వ సెక్షన్ మన గొంతును పెగలనివ్వదు. అలాగే సెక్షన్ 30 ఉక్కు పాదాల క్రింద మన సభలు, ఊరేగింపులు 'క్రమబద్ధం' నెపంతో ఛిన్నాభిన్నమవుతాయి. మన చట్టాలలో నిరసన హక్కుపై ఇంత దారుణమైన ప్రకటిత, అప్రకటిత నిషేధాల కొనసాగింపు ప్రభావం ఉద్యమకారులు తమ నిరసనకు ప్రభుత్వ ఆస్తులను సాధనంగా వాడుకోవడం అనివార్యమైంది. "న్యాయశాస్త్రం, నీతి, మతం అనేవి అన్నీ బూర్జువా గుడ్డి నమ్మకాలనీ, ఒక్కొదాని చాటున ఒక్కొక్క బూర్జువా స్వార్థం పొంచి ఉందని కార్మికుని భావన". ఈ వాక్యం మనం చదివిన 'కమ్యూనిస్ట్ మేనిఫెస్టో'లోదనే విషయం త్వరగానే గుర్తుకు వస్తున్నా, న్యాయశాస్త్రం వెనుకనున్న బూర్జువా స్వార్థం మాత్రం ఇప్పుడిప్పుడే ప్రజల అవగాహనలోకి వస్తుంది.

—యం. డి. యాకూబ్ పాషా

కవిత :

# ఆయిగాడు

అందరూ అలవోకగా అనగలిగిన
సామెతొకటి
నన్ను అలజడికి గురిచేస్తుంది.
నాలుగు రోడ్ల కూడలయినా కావచ్చు
వీధి నల్లా కావొచ్చు
నా పక్కిల్లు కావొచ్చు
నా సన్నిహితుల సమక్షం కావచ్చు
యే కారణం లేకుండానే
వెక్కిరింతకి గురవుతాను.
పొద్దున్నుండి యెన్ని యెంగిలి గెడ్డాలు
కొరిగితేనో
పైటాలకు నా యింట్లో
రాళ్ళతోపాటు వెంట్రుకలూ యేరేసేందుకు
పిడికెడు బియ్యంనూకలు రాలుతాయి.
పని లేని రోజు
నా ఆలుబిడ్డల ఆకలి గురించి
మాట్లాడండి నా సాములారా !
మడుపుకత్తి తప్ప
కాసింత మడిచెక్క లేని
నా పేదరికం గురించి
మాట్లాడండి నా దొరలారా !
పస్తులు వుండలేక
నా పూర్వీకులు
పిల్లి మెడను కోసింటారు గానీ
తలను గొరిగేంత
వెర్రిబాగులోల్లు కాదు బాబులారా !
అంత వెర్రిబాగులోల్లయితే
యీ దేశానికి
అందమైన తలకట్టు వుండనే వుండదు.

* * *

అవును బాబు
మేము ఎచ్చులోల్లమే
ఎవరు తండ్రీ మమ్మల్ని ఎచ్చులు మాట్లాడించిందీ !
పనీ పాటా చేతగాని
మీ యెక్కువ కులపోల్లందరూ
నా సెలూన్లో చేరి
సొల్లు కూతలు కూయగా లేంది
యాడున్న గొప్పా మీదేనని చెప్పగా లేంది
నేను మాట్లాడిందే ఎచ్చులయిపాయనా
ఎచ్చులు కాదు సోదరులారా
యెందుకూ కొరగానోల్లు
నా విద్యను తక్కువజేసి మాట్లాడినపుడు
దిగమింగుకున్న అవమానం
మంగలి ఎచ్చులు అన్న మరుక్షణమే
నేను ఆగ్రహిస్తే....
మీ మొగాలు పెచ్చులు పెచ్చులయిపోవూ

* * *

అయిందంతా అయినోళ్ళకి వూడ్చిపెట్టి
ఆకూ వక్కా అయ్యవార్లకి అందించి
అడుగూ బడుగూ అయిగాళ్లకి వెయ్యండి
మీ పెళ్ళిల్లకీ పేరంటాలకి
పేగులు నోటికొచ్చేట్లు మేళం వాయిస్తాను
డొక్కలు బిగపట్టి డోలు వాయిస్తాను
కాలిగోల్లు తీస్తాను మాలీసు చేస్తాను
యింత జేసినా
యింటి మంగలోడు అంటారు
యింటి వెనకాల విస్తరేస్తారు

* * *

యెంత సుబ్బరంగా వుంటేనేమి
యెంత నాజూకుగా వుంటేనేమి
కులం వురితాడుకి వేలాడుతుంటాను
యిల్లు వూరిమధ్యే అయినా
వునికి వేయి ఆమడల దూరం

— రాప్తాడు గోపాలకృష్ణ

# ప్రజ

[అరుణతారకు ఇరవై సంవత్సరాలు నిండిన సందర్భంగా ప్రజ శీర్షికను మళ్ళీ ప్రారంభిస్తున్నాం. అరుణతార తొలి రోజుల్లో ప్రజ శీర్షిక ఎంతో ఆసక్తిని రేకెత్తించింది. సాహిత్య, సామాజిక, తాత్విక, రాజకీయ అంశాలెన్నిటి పైనో పాఠకులు ఈ శీర్షిక క్రింద ఎన్నో ప్రశ్నలడిగారు. విరసం బాధ్యుల నుంచి సవివరమైన, విశ్లేషణాత్మకమైన జవాబులు పొందారు. ఈ శీర్షికను తిరిగి ప్రవేశపెట్టవలసిందిగా ఒత్తిడి చేస్తూ పాఠకులు ఇప్పటికీ ప్రశ్నలు పంపుతున్నారు.

— సంపాదకుడు]

ప్రశ్న : గత ఐదారు సంవత్సరాలుగా విరసం పనితీరులో లోపాల గురించి బైటి పత్రికల్లో చాలా విమర్శలు చదువుతున్నాం. వాటికి వివరణలు గాని, ఆ విమర్శలు సరైనవే అయితే ఒప్పుకోవడం గాని విరసం వైపు నుంచి జరగడం లేదు. మీరు రాసినా ఆ పత్రికల్లో రావడం లేదా ? లేక మీరు జవాబులు రాయడం లేదా ? ఆంధ్రభూమిలో ఐదు నెలల క్రింద "సృజనకు శిరశ్ఛేదం విరసం సంప్రదాయం" అని ఒక వ్యాసం వచ్చింది. దానిలో విరసం మీద తీవ్రమైన విమర్శలున్నాయి. వాటికి జవాబు చెప్పవలసిన బాధ్యత మీకు లేదా ? ఇన్నాళ్లుగా ఆంధ్రభూమిలో మీ వివరణ వస్తుందని ఎదురుచూసి ఇప్పుడు మీకు రాస్తున్నాను.

— పి. వెంకటేశ్వర్లు, కరీంనగర్

జవాబు : విరసం పుట్టిన మరుక్షణం నుంచి ఇప్పటిదాకా ప్రభుత్వం, పోలీసులు, సర్కారీ సాహిత్యకారులు, సోదర సాహిత్య, సాంస్కృతిక సంస్థలు, నిర్మాణమే కంటగింపయిన వ్యక్తులు ఎందరెందరో ఎన్నో విమర్శలు చేస్తూ వస్తున్నారు. ఇందులో నిరాధారమయిన నిందలు, మా లోపాలను ఎత్తి చూపి చంకలు గుద్దుకునే వైఖరి, మా లోపాలను సవరించి నిర్మాణాన్ని బలోపేతం చేసే నిర్మాణాత్మక విమర్శలు - అన్నీ ఉన్నాయి. మొదటి రెండు ధోరణుల పట్ల ఎప్పటికప్పుడు కచ్చితమైన వివరణలు ఇవ్వడం, మూడో ధోరణి పట్ల సవినయంగా సవరించుకునే వైఖరి ప్రకటించడం విరసం దృక్పథం. అయితే ఈ పని గత ఐదారు సంవత్సరాలుగా జరగవలసిన పద్ధతిలో జరగడం లేదు. అందువల్ల, గోబెల్స్ ప్రచారం లాగ నిరాధారమైన నిందలలోనే ఏ మాత్రమైనా నిజం ఉన్నదేమోనని అమాయ

కులు అనుకునే ప్రమాదం ఏర్పడింది. ఈ పొరపాటును విరసం అంగీక రిస్తోంది. బైటి పత్రికలు వేసినా వేయకపోయినా, వచ్చిన ప్రతి విమర్శకూ జవాబు చెప్పడం ప్రజల పట్ల తన బాధ్యతగా విరసం గుర్తిస్తోంది.

"సృజనకు శిరచ్ఛేదం విరసం సంప్రదాయం" అనే పేరిట ఆంధ్రభూమి సాహితిలో ఈ జనవరి 20 న అచ్చయిన చారి వ్యాసం విరసం మీద ఆయనకు ఉన్న అక్కసుకు, ఆయన కల్పనా చాతుర్యానికి, అబద్ధాలకు అద్దం పడుతుంది. ఆ వ్యాసంలో ఆయన ఒకవైపు విరసం "గిడసబారి పోయిందని" అంటూనే, మరోవైపు ఆ గిడసబారిన సంస్థలోంచి సౌదా బహిష్కరించబడినందుకు "ఆశ్చర్యం, బాధ" ప్రకటించారు.

సౌదా బహిష్కరణ ఎందుకు జరిగిందో అరుణతార, ఫిబ్రవరి 1997 సంచికలో సవివరమైన తీర్మానం వుంది. ఆ బహిష్కరణ "సృజనాత్మకతను చూసి జడుసుకున్న జడత్వం"గా, "ప్రశ్నలకు సమాధానం చెప్పే శక్తిలేక ప్రశ్నించినవాడి తల నరికి కోట గుమ్మానికి వేలాడదీసే ఫ్యూడల్ దురహంకారం"గా, "దశాబ్ద కాలంగా విరసం ప్రాపంచిక దృక్పథంలో ఎలాంటి పరిణతి లేపనడానికి తార్కాణం"గా, సంక్రాంతి పండగకు గొంతు కోయడంగా చారికి కనిపించడంలో ఏమీ ఆశ్చర్యం లేదు. విరసంలో పదేళ్ళపాటు సభ్యుడిగా ఉండి, బహిష్కరించదగిన పనులు చేసి, కేవలం విరసంలో ఇంకా కొనసాగుతున్న మధ్యతరగతి మర్యాదల వల్ల విరసంలోంచి గౌరవంగా చడీ చప్పుడూ లేకుండా వెళ్ళిపోయాడు చారి. ఎవరినుంచి దొంగిలించామో వాళ్ళను క్షమించడం కష్టం అని చలం అన్నట్టు చారికి విరసాన్ని క్షమించలేనంత అక్కసు ఉండడానికి ఆధారాలున్నాయి.

సరిగ్గా పది సంవత్సరాల క్రితం త్రిపురనేని శ్రీనివాస్‌ను విరసం పెద్దలు ఇలాగే బహిష్కరించారని, శ్రీనివాస్‌కూ సౌదాకూ మధ్యకాలంలో చాలామందినే వదుల్చుకున్నారని, కాని "వారు త్రిపురనేని శ్రీనివాస్‌లా, సౌదాలా జగమెరిగినవారు కాకపోవడం వల్ల విషయం పబ్లిక్ కాలేద"ని చారి రాశాడు. ఈ మధ్యకాలంలో బహిష్కరణకు గురయినవాళ్ళు శివసాగర్, బి.ఎస్. రాములు, రుద్రజ్వాల. వాళ్ళు జగమెరిగినవారు అవునో కాదో చారికే తెలియాలి. ఒక్క రుద్రజ్వాల బహిష్కరణ తప్ప మిగిలిన అన్ని బహిష్కరణలకూ కనీసం మూడు, నాలుగు సంవత్సరాల చరిత్ర ఉంది చర్చ, వివరణలు కోరడం, సంజాయిషీ కోరడం, సస్పెన్షన్, బహిష్కరణ ప్రతిపాదనపై చర్చ– ఈ క్రమమంతా ప్రతి బహిష్కరణ విషయం లోను జరిగింది. ఏ సంఘ నిర్మాణంలోనైనా ప్రజాస్వామికంగా ఉండడం, క్రమ

శిక్షణా రాహిత్యాన్ని శిక్షించడం రెండూ ఉంటాయి. ప్రజాస్వామికంగా ఉండడమంటే క్రమశిక్షణా రాహిత్యాన్ని ఆమోదించడం కాదు. క్రమశిక్షణ పాటించడమంటే అప్రజాస్వామికంగా ఉండడం కాదు. శ్రీనివాస్, శివసాగర్, బి.ఎస్. రాములు, సౌదాల భిన్నాభిప్రాయాలను గౌరవిస్తూనే, ఆ అభిప్రాయాలపై చర్చకు అనుమతిస్తూనే, అభిప్రాయ భేదాల పేరిట సంస్థను విచ్ఛిన్నం చేసే, నిర్మాణ సూత్రాలను ఉల్లంఘించే వైఖరిని విరసం తప్పు పట్టింది. నిజానికి శిక్ష నిర్మాణ సూత్రాల ఉల్లంఘన పైననే గాని, భిన్నాభిప్రాయాలపై కాదు.

చారి రాసిన అబద్ధాల్లోకెల్లా పెద్ద అబద్ధం సుబ్బారావు వ్యాసం గురించి. 'సందిగ్ధ సందర్భం'లో అచ్చయిన ఆ వ్యాసాన్ని సుబ్బారావు, "విరసం సభ్యులచేత చదివించి చర్చ జరపాలని కోరుతూ ఒక పెద్దాయనకు ఇచ్చారు. ఆ పెద్దాయన ఆ వ్యాసాన్ని ఇతరుల కంటపడకుండా జాగ్రత్త చేశారు" అని చారి రాశాడు.

సుబ్బారావు ఆ వ్యాసం రాసినది 1989 చివరిలో. 1990 జనవరిలో విరసం ద్విదశాబ్ది సభల సందర్భంగా సృజన పునఃప్రారంభమైనప్పుడు ఆయన మొదట సృజనలో అచ్చుకోసమని ఆ వ్యాసం రాశారు. తరువాత రచనల ఎంపిక సందర్భంగా 'సాహితీమిత్రులు' ఆ వ్యాసాన్ని చర్చించినప్పుడు, ఆ వ్యాసం ప్రచురణకు ఇవ్వనని, అంతర్గతంగా చర్చ జరపాలని సుబ్బారావే వెనక్కి తీసుకున్నారు. దాన్ని ఎవరూ తొక్కిపెట్టలేదు. ఆ వ్యాసంలో సుబ్బారావు వెలిబుచ్చిన అభిప్రాయాలన్నీ జవాబు చెప్పడానికి భయపడేంత గడ్డు సమస్యలేమీ కావు. ఇంతకూ ఆ వ్యాసంలో సురా విరసం గురించి చేసిన వ్యాఖ్యల సంగతి ఎట్లా ఉన్నా, వ్యక్తివాదం, కెరీరిజం గురించి చేసిన వ్యాఖ్యలు చారికీ, చారి ఉపహరించిన లాంటివారికే సంపోతాయి.

పాలకవర్గ, పితృస్వామిక, హిందూ బ్రాహ్మణీయ సాంప్రదాయం ఈ దేశంలో కోట్లాదిమంది శ్రామికుల, స్త్రీల, దళితుల సృజనను రోజు రోజూ శిరచ్ఛేదం చేస్తున్నది. అలా క్షణక్షణం అణచివేయబడుతున్న గళాలకు ఊపిరి పోసేందుకే విరసం ఆవిర్భవించింది. విరసం సంప్రదాయం సృజనకు శిరచ్ఛేదం కాదు. అయితే సృజన శక్తి ఒక సంఘటిత, నిర్మాణాత్మక, లక్ష్య స్పష్టత గల ప్రవాహంగా ఉండాలని విరసం భావిస్తుంది. ఎవరికి వారే మహాకవి అయిన అహంకారులకు, నిర్మాణం, లక్ష్యం, సిద్ధాంతం అక్కర్లేదనుకునే అరాచకులకు విరసమే శత్రువుగా కనబడడంలో ఆశ్చర్యం లేదు. ★

# వ్యాసం

## సాహిత్య గుత్తాధిపత్యాన్ని విరసం అంగీకరించదు

"జిహాద్" కవితా సంకలన ప్రచురణతో, విరసంపై సరికొత్తదాడి మొదలయ్యింది. విమర్శ ప్రజాస్వామికంగానూ, నిర్మాణాత్మకంగానూ వుంటే అభినందనీయమే. ఆహ్వానించాలి కూడా. అయితే చాలాకాలంగా నిందలూ, ఆరోపణలు, దూషణలు మాత్రమే సాహిత్య విమర్శగా చెలామణి కావడం, అదే స్థాయిలోనే జవాబిస్తే తప్ప అవతలివారు సంతృప్తి పడకపోవడం - ఇలాంటి పరిస్థితులలో అదే దూకుడుగా జవాబిచ్చేందుకు విరసంకు యిబ్బందికరంగా వుంది. విడి విడి వ్యక్తులుగా ఎవరు ఏమి వ్యాఖ్యానించినా, రాసినా చెల్లుతుంది. పోగా, వారికి బహుళ ప్రాచుర్యమూ లభిస్తుంది. వారెవ్వరూ, ఎవ్వరికీ జవాబుదారి కాదు. కాని ఒకసంస్థగా, విరసం ఏమి మాట్లాడినా, రాసినా సంయమనం పాటించాల్సి వుంటుంది. కొన్ని పరిమితులకు లోనై ఆ సంస్థ సభ్యులు జవాబివ్వాల్సి వుంటుంది. విరసం విప్లవ సాహిత్యాభిమానులకు, పీడిత ప్రజలకు జవాబుదారి అవుతుంది. కాబట్టి శుష్క నిందలకు, శూన్య ఆరోపణలకు దిగజాలదు. అందుకే విరసం సభ్యుల నుండి వచ్చే జవాబులు చాలా defensiveగా కన్పడుతాయి. అయితే సంయమనం బలహీనత గాదని విరసం వ్యతిరేకులు ఎంత త్వరగా తెలుసుకుంటే అంతమంచిది.

సామాజిక ఉద్యమాలపట్ల, కొత్త కొత్త సాహిత్య ధోరణుల పట్ల వెంటనే స్పందించి, విరసం తన అభిప్రాయాల్ని వెల్లడిస్తే దాన్ని ఆధిపత్య ధోరణిగా, పీఠాధిపత్యంగా నిందించిన వాళ్ళే, ఆ ఉద్యమాల, ధోరణుల పట్ల కొంత సంయమనం పాటించి, అవి పయనిస్తున్న మార్గాలను, వాటి లక్ష్యాలను గమనించాకే తన అభిప్రాయాల్ని వ్యక్తం చేయాలని కొంతకాలం మౌనంగా వుంటే, విరసంకు చెప్పేదేమీలేదని, ముందుచూపు కొరవడిందనీ, మౌనంతో, నిర్లక్ష్యంతో ప్రత్యర్థులను చంపివేయాలని చూస్తున్నదనీ ఆరోపణలు చేస్తారు. ఇలా ఈ ఆరోపణలను చేస్తున్న వారందర్నీ ఒక మూసగా చూడాల్సిన అవసరం లేదుగాని, వారు చేస్తున్న ఆరోపణలకు మాత్రం యేమాత్రం పునాది లేదని చెప్పగలం.

విరసంను 'చారిత్రక నేరస్థుల' జాబితాలో చేర్చిన అనంత్, ఆ నేర నిరూపణకై చూయించిన సాక్ష్యాలు పస లేనివిగా వున్నాయి. విరసంలో ప్రజాస్వామ్య ధోరణి లేదని, అది తన కవిత్వ చిక్కదనం వల్లగాక, దబాయింపువల్ల, మౌనంగా నిర్ల క్ష్యంతో ప్రత్యర్థులను చంపేయాలనే ప్రయత్నం వల్ల సాహిత్యరంగంలో తన ఆధి పత్యాన్ని నిలుపుకుంటుందనీ అనంత్ ఆరోపణ చేసాడు. ఇప్పుడు కొంతమంది 'ప్రజాస్వామ్య ధోరణి'కి కొత్త నిర్వచనం యిస్తున్నారు. ఒకరి అభిప్రాయాల్ని ఒకరు వినడం, చర్చించడం కేవలం తన వాదనా పటుత్వం వల్లగాక, సైద్ధాంతిక బలం వల్ల, ఆచరణవల్ల తనతో విభేదిస్తున్నవారిని ఒప్పించే ప్రయత్నం చేయడం లాంటివి ప్రజాస్వామ్య ధోరణికి గీటురాళ్లుగా యింతవరకు అందరమూ పరిగణిస్తూ వచ్చాము. అలాగాక, తమ అభిప్రాయాల్ని (అది సంఖ్యాపరంగా అతి తక్కువ మందిదైనా) అవతలివారు (వారు మెజారిటీ అయినా) అంగీకరిస్తే అది ప్రజా స్వామ్యమని, అందుకు భిన్నంగా మెజారిటీ సభ్యుల అభిప్రాయాలను అమలుచేస్తే, దాన్ని బ్రూట్ మెజారిటీ నిరంకుశత్వంగా ప్రచారం చేస్తున్నారు. విరసం, ఇంత వరకు మెజారిటీ - మైనారిటీ అభిప్రాయాల తేడా లేకుండా అందరి అభిప్రాయాలకు వాటికి తగినంత విలువనిస్తూనే వుంది. ఏ సమస్యనూ, మెజారిటీ-మైనారిటీ తూకంతో విరసం యింతవరకు యెప్పుడూ పరిష్కరించలేదు కూడా. అలాంట ప్పుడు, అనంత్ ఏ చారిత్రక ఋజువుల ఆధారంగా విరసం అప్రజాస్వామికంగా ప్రవర్తిస్తున్నదని ఆరోపణ చేసాడో ? గతంలో, దళిత, స్త్రీవాద, పోస్టు మాడ ర్నిజంపై జరిగిన చర్చలలో విరసం సభ్యులు పూర్తి ప్రజాస్వామికంగానే పాల్గొన్న విషయం అనంత్‌కు తెలియంది కాదు. ఒక్కొక్కసారి అవి విరసం నిర్మాణ సూత్రాల్ని ఉల్లంఘించి జరిగాయి కూడా. వ్యక్తులకు నిర్మాణ సూత్రాలు వర్తించవు గాని, సంస్థలలోని సభ్యులకు వర్తిస్తాయనే విషయం గమనించాల్సి వుంది.

ఇక 'దబాయింపువల్ల, నిర్మూలించడంవల్ల, అణచివేయడం వల్ల, ఎవరికీ జవాబుదారీ గాకపోవడం వల్ల, శాసించే తత్వాన్ని విప్లవ సాహిత్యోద్యమం-విరసం నిలబెట్టుకుంటున్నాయనే అనంత్ ఆరోపణ అర్థరహితం. విరసం, తన సాహిత్య కృషి వల్ల, పీడిత ప్రజల పట్ల గల నిబద్ధత వల్ల, తన సైద్ధాంతిక బలం వల్ల, తన కార్యక్రమాల, ఆచరణలవల్ల సాహిత్యరంగంలో తన స్థానాన్ని నిలబెట్టుకుంటున్నది. గత పదేళ్ళుగా సాహిత్యంలోని వివిధ ధోరణులపై జరిగిన చర్చంతా,

విరసం - విప్లవ సాహిత్యోద్యమాన్ని లక్ష్యంగా, కేంద్రంగా వుంచి సాగిందే. విరసం గురించి - విరసం వ్యతిరేకులూ మాట్లాడకుండా వుండలేని స్థితి, విప్లవ సాహిత్యానికి తెలుగురంగంలో వున్న స్థానాన్ని తెలియజేస్తుంది కూడా.

'జిహాద్' ప్రచురణపై ఖదీర్ ఆరోపణలను వుటంకిస్తూ, విరసం మౌనంతో, నిర్లక్ష్యంతో ప్రత్యర్థులను నిర్మూలించేందుకు చేస్తున్న ప్రయత్నాల్లో భాగంగానే, ఖదీర్ ఆరోపణలకు జవాబివ్వలేదనే తొందరపాటు నిర్ణయానికొచ్చాడు అనంత్. అయితే ఖదీర్ ఆరోపణలకు వివరంగా, "విరసంకు ప్రాణం రాజకీయ అవగాహన-విప్లవం-అహంకారం కాదు" అనే శీర్షికతో షరీఫ్ జవాబు ('ఆంధ్రజ్యోతి' 8-6-97 ఆదివారం అనుబంధం) వచ్చింది. ఆ సమాధానం ఖదీర్‌కేగాక, అనంత్‌కు, అఫ్సర్‌కూ తృప్తినీయక పోవచ్చు. అది వేరే చర్చగాని; మౌనంతో, నిర్లక్ష్యంతో, జవాబుదారి లేనితనం వల్ల విరసం తన స్థాయిని నిలబెట్టుకునేందుకు విరసం ప్రయత్నిస్తున్నదనే ఆరోపణ మాత్రం సత్యదూరమని షరీఫ్ జవాబు తెలియ చేస్తుంది. అంతేగాదు, గతంలో స్త్రీవాద, దళితవాద సాహిత్యంపై విరసం సభ్యులు చర్చలలో పాల్గొనడం, విరసం తన మహాసభల్లో, సాహిత్య పాఠశాలల్లో, ఆ అంశాలపై ప్రత్యేక ప్రసంగాలను, చర్చలను ఏర్పాటు చేయడం, విరసం కార్య క్రమాల్ని గమనిస్తున్న వారందరికీ తెలుసు. మరి, ఇవన్నీ విరసం తన ప్రత్యర్థుల్ని (వారెవరో అనంత్‌కే తెలియాలి) మౌనంతో చంపేసే ప్రయత్నాలనే విషయం పాఠకులు నిర్ధారించుకుంటారు.

మనం వ్యతిరేకించేవారిని దెబ్బ తీయాలనుకుంటే, వారిపై అసత్యారోపణలు చేసి, గోబెల్స్ ప్రచారంతో వారిని defenseలో పెట్టి వారు యేనాడు తెల్పని అభిప్రాయాలను వారి అభిప్రాయాలుగా ప్రచారం చేసి, వాటిపై తీవ్ర విమర్శ చేయడం, పాఠకులను గందరగోళపరచడం, విరసం వ్యతిరేకులు గత కొద్ది కాలంగా చేస్తున్నవే. దళిత, స్త్రీవాద సాహిత్యాలపై, పోస్టుమాడర్నిజంపై చర్చలు జరిగినపుడు తమకు తామే వాటి ప్రతినిధులుగా, పరిరక్షకులుగా ప్రకటించుకొని, సైద్ధాంతిక చర్చకన్నా ఎక్కువగా నిందలతో, ఆరోపణలతో విరసంపై దాడి చేసిన వారే, గతంలో స్త్రీ, దళితవాద సాహిత్యాన్ని విరసం పట్టించుకోలేదని తీవ్రంగా విమర్శించినవారే నేడు 'జిహాద్' కవితా సంకలనం విరసం ప్రచురణగా రాగానే, దాన్ని ముస్లింలపై విసిరిన వలగా, ముస్లిం ప్రయోజనాలకు వ్యతిరేకంగా విరసం

జరిపిన కుట్రగా విరసంపై దాడి చేయడం అదేదో తమ స్వంత జాగీరులోకి విరసం, విప్లవోద్యమం దురాక్రమణ చేసి ఆక్రమిస్తున్నదని వాపోవడం విడ్డూరంగా వుంది.

జనవరి సాహిత్య పాఠశాలల్లో ఆవిష్కరించాలనే తొందరలో 'జిహాద్' కవితా సంకలనం తేవడం వల్ల కొన్ని పొరపాట్లు జరిగాయనేది విరసం అంగీకరిస్తూనే వున్నది. ముందుగా, ఆ సంకలనం తేవాలనుకున్న వారికి, తమ కవితల్ని తామే సంకలనంగా తేవాలనుకున్న కవులకు యేమాత్రంతెల్పకుండా,వారికి అంగీకారంలేకుండా కవితా సంకలనం అచ్చువేయడం పొరపాటు. దీనికి కేవలం షరీఫ్, ఖాదర్, డానీలు, విరసం ప్రకాశం జిల్లా యూనిట్‌యేగాక, విరసం సంస్థగా కూడా బాధ్యత వహించాల్సిందే. అంతేగాక, ఆ సంకలనంలో చోటు చేసుకోవాల్సిన హనీఫ్, దేవీప్రియలాంటి కవుల కవితలు అందులో చోటు చేసుకోకపోవడమూ విచారకరమే. అంతేగాని, ముస్లింల గురించి మాట్లాడే హక్కు విరసంకు లేదని, అది కేవలం కొందరి పేటెంట్ హక్కుగా దబాయించడమనే సాహిత్య గుత్తాధిపత్యాన్ని అంగీకరించడానికి విరసం సిద్ధంగా లేదు. 'జిహాద్' కవితా సంకలన ప్రచురణతోనే విరసం ముస్లింల గురించి మాట్లాడటం ప్రారంభించలేదు. ఆ ప్రచురణతోనే, విరసం మాట్లాడటం ఆగిపోదు. హిందూ మత దురహంకారంవల్ల అణచివేయబడుతున్న ముస్లింల గురించి మొదటి నుండి విరసం మాట్లాడుతూనే వుంది. వారి హక్కుల, సంస్కృతి పరిరక్షణ గురించి విరసం సభలూ, సమావేశాలు నిర్వహించింది. వాటిని గురించి షరీఫ్ తన వ్యాసంలో వివరంగా చెప్పాడు. కేవలం 'జిహాద్' కవితా సంకలన ప్రచురణతోనే, ముస్లింలంతా విప్లవ సాహిత్యాభిమానులై, విప్లవోద్యమంలో భాగస్వాములవుతారనే ఆందోళన, భయం, విరసం వ్యతిరేకుల కుండ వచ్చేమోగాని, అలాంటి దురాశ విరసంకు లేదు. ముస్లింలపట్ల, వారి ఆశలు, ఆందోళనలు, ఆకాంక్షలపట్ల సంఘీభావం తెలిపే ప్రయత్నంలో భాగంగానే విరసం 'జిహాద్' కవితా సంకలన ప్రచురణకు పూనుకుంది. పీడిత ప్రజల గురించి, (వారే జాతి, కుల, మత, ప్రాంతానికి చెందినవారైనా) మాట్లాడే హక్కు, వారితో భుజం, భుజం కలిపి, అణచివేతకు, ఆధిపత్యాలకు వ్యతిరేకంగా పోరాడే హక్కు విరసంకు వుంది. అలా చేయడమే విరసం ప్రాపంచిక దృక్పథం కూడా. అందువల్ల కొందరు, ఆ యా సెక్షన్ల నాయకులుగా తమకు తామే ప్రకటించుకొని, విరసంను కట్టడి చేయాలనే ప్రయత్నాలను విరసం ఖాతరు చేయదు.

ముస్లింల ప్రత్యేకతను నొక్కేయాలని చూస్తున్న నేరస్థుల జాబితాలో, విరసంతోపాటు, దళితువాదులనూ చేర్చాడు అఫ్సర్. 'చిక్కనవుతున్న పాట' సంకలన ప్రచురణతో మొదలైన ఆ కుట్ర, 'జిహాద్' ప్రచురణతో పరాకాష్ఠనందు కుందని ఆయన అభిప్రాయం. అయితే, 'చిక్కనవుతున్న పాట' ప్రచురణ నేపథ్యం గురించి మనం కొంకెం మాట్లాడుకోవల్సి వుంటుంది. అప్పుడే, ముస్లింల ప్రత్యేకతను దళితవాదులు 'బహుజనుల' మాటతో చంపివేసే ప్రయత్నం చేసారనే అఫ్సర్ ఆరోపణకు జవాబు వెదుక్కోగలం. దళిత సాహిత్య ప్రభంజనమని చెబుతున్నదానికి, కారంచేడు, నీరుకొండ, చుండూరులలో అగ్రవర్ణ దురహంకారం దళితులను ఊచకోత కోసినపుడు పెల్లుబికిన దళిత సంక్షుభావం, ఆగ్రహం ఊపునిచ్చిన మాట వాస్తవం. అయితే, అదే సమయంలో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో ఎస్. సి., బి.సి.ల ప్రతినిధులుగా బి.ఎస్.పి–ఎస్.పి పార్టీల కూటమి ప్రభుత్వాధికారం చేపట్టడమూ జరిగింది. దానితో దళితుల, బి.సిలలోని విద్యాధికులకు తొలిసారిగా, తామూ ఈ వ్యవస్థలో ప్రభుత్వాధికారం చేపట్టగలమనే ఆత్మవిశ్వాసం కలిగింది. కొత్త కొత్త సిద్ధాంతాల, "దేశీయ మార్క్సిజం", 'అంబేద్కరిజం-మార్క్సిజం' ఆవిష్కరణలు జరిగాయి. ఉత్తరప్రదేశ్ లాంటి రాష్ట్రంలో ఎస్.పి–బి.ఎస్.పి. పార్టీలు అధికారంలోకి రావడాన్ని 'నూతన ప్రజాస్వామిక విప్లవం'గా దళిత (బి.సి) మేధావులు అభివర్ణించేదాక ఆశలు కల్పించింది. విప్లవోద్యమం-విప్లవ సాహిత్యో ద్యమం అగ్రవర్ణాల చేతుల్లో వున్నాయంటూ, పుట్టుకతో గుణాన్ని నిర్ణయించే మను వాదం కొత్త రూపంలో ప్రత్యక్షమయింది. పెరిగిన దళిత చైతన్యానికి నాయకత్వం వహించేందుకు బహుజనులను (ఎస్.సి; బి.సి; ఎస్.టి, మైనారిటీలను) దళితులుగా పేర్కొంటూ ముందుకు వస్తే, 'ఊరు', 'వాడ' దళితులుగా ఎస్.సి-బి.సిల ప్రత్యేక తల యెత్తి చూపుతూ మరికొందరు వాదాలకు దిగారు. ఆ వాద వివాదాలలో, అసలు ముస్లింలు దళితుల కేటగిరికి చెందుతారా ? వారు గురవుతున్న వివక్షత, అణచివేత, భద్రతా లేమి ప్రత్యేకమైనవి కావా ? అనే విషయాన్ని అంతగా (యే ఒకరిద్దరు తప్ప) యెవ్వరూ చర్చించలేదు. అప్పటి వాదనలంతా దళితుల గురించి దళితులే మాట్లాడాలి, స్త్రీల గురించి స్త్రీలే మాట్లాడాలి అనే పేటెంట్ హక్కులపై మాత్రమే జరగడం గమనించవచ్చు. అయితే ఆ దళితులూ, స్త్రీలు విప్లవ సానుభూతిపరులు, విరసం సభ్యులూ మాత్రం కాకూడదు. వారు అగ్రవర్ణ భావజాలానికి లోనయి

వుంటారనీ, లోనయ్యారనీ, విప్లవవాదులెవ్వరికీ స్త్రీల, దళితుల గురించి మాట్లాడే హక్కు లేదనీ ఫర్మానాలు జారీ చేయబడ్డాయి. మరి ఆనాడు, ముస్లింలను బహుజనులుగా, కొన్నిసార్లు దళితులుగా చిత్రీకరించి, ఆ సెక్షన్లకు నాయకత్వం వహించాలని దళిత మేధావులు ప్రయత్నం చేసినపుడు, ముస్లింల ప్రత్యేకత, 'ముస్లిమీయత' గురించి యే ముస్లిం మేధావి నోరు విప్పకపోవడం గమనార్హం. అయితే, ఆ మేధావులకే, విరసం 'జిహాద్' కవితా సంకలనం తేవడం నేరమైంది. ఆ సంకలన ప్రచురణకు చొరవ తీసుకొన్నవారు ముస్లింలే అయినా, వారు విరసం సభ్యులైనందువల్ల, సానుభూతిపరులైనందువల్ల అఫ్సర్‌కు వారు నేరస్థులైనారు. విరసంపట్ల అఫ్సర్‌కున్న యిలాంటి గుడ్డి వ్యతిరేకత, విరసం "మైనారిటీ" అనే పదాన్ని ముస్లింలపట్ల వాడినందుకు అతను విరుచుకపడటంలో పరాకాష్ఠనందుకుంది. బి.సి-ఎస్.సి-మైనారిటీలంటూ దళితవాదులు రాస్తున్నపుడు 'పవిత్రమైన' ఆ పదం ('మైనారిటీ') విరసం వుపయోగించగానే 'మైల' పడిందా ?

'జిహాద్' సంకలనానికి విరసం ప్రకాశం జిల్లా యూనిట్ రాసిన 'మా మాట' లోని "విప్లవ సాహిత్యోద్యమం జీవితంలోని, సమాజంలోని, అన్ని కోణాలనీ, అంశాలనీ స్పృశిస్తుంది" అనే వాక్యం అఫ్సర్‌కు ఆశ్చర్యం కల్గించడం వింతగా వుంది. అదేదో, నేడు ముస్లింలను బుట్టలో వేసుకొనేందుకు తన అజండాలో విరసం కొత్తగా చేర్చిన అంశంగా పాఠకులను భ్రమింప చేయడానికి అఫ్సర్ ప్రయత్నించాడు. విరసం తాత్త్విక దృక్పథం మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం. అదొక సమగ్ర ప్రాపంచిక దృక్పథం (ఈ మాట అఫ్సర్ లాంటి వారికి రుచించకపోవచ్చు). ఆ ప్రాపంచిక దృక్పథపు వెలుగులో రచన చేయడమంటేనే జీవితంలోని, సమాజంలోని అన్ని కోణాలనీ, అంశాలనీ పరిగణలోనికి తీసుకొనడమే. అయితే ఆచరణలో, కొన్ని చారిత్రక అవసరాల రీత్యా, పరిస్థితులవల్ల విరసం సభ్యులు తమ రచనల్లో అన్ని అంశాలకు సమానమైన ప్రాధాన్యత యివ్వలేదనే మాట వాస్తవమే. కాని అదేదో, దురుద్దేశ్య పూర్వకంగా, కుట్ర పూరితంగా చేసిన పనేమీ కాదు. అఫ్సర్ ఆరోపించినట్టు స్త్రీవాద, దళిత వాదాలను మొదట నిర్లక్ష్యం చేసి, ఆ తర్వాత మింగలేక కక్కలేక విరసం అక్కున చేర్చుకోలేదు. అలాగే, నేడు కొత్తగా ప్రజాస్వామ్య పాఠాన్ని స్వీకరించి ముస్లింలను చేరదీసే ప్రయత్నమూ చేయడం లేదు. అన్ని పీడిత సెక్షన్ల ప్రజాస్వామ్య పోరాటాలకు

సంఘీభావం ప్రకటించడమే గాక వాటిలో పాల్గొనడమూ విరసం గతంలో చేసింది– యిక ముందు చేస్తుంది కూడా. అంతేగాని తాను ముందుగా, విమర్శనా రహితంగా వాటిని అక్కున చేర్చుకొనకపోతే, వాటి నాయకత్వం మరెవరి చేతుల్లోకో వెళతుందనే దుగ్ధ, తొందరపాటు విరసంకు లేదు. దళితవాదమైనా, స్త్రీవాదమైనా, ముస్లింవాదమైనా విరసం వాటి ప్రత్యేకతలను గుర్తించింది. అవి నిర్దుష్టంగా ముందుకు తెచ్చిన సమస్యలకు గుర్తిస్తూనే, ఆ ఉద్యమాల పరిమితులను తెల్పింది. విరసం, తన సాహిత్య పాఠశాలల్లో, మహాసభల్లో, AILRC సభలలో ఆ యా ఉద్యమాలను ప్రత్యేకాంశాలుగా చేర్చి చర్చించడం, ఆ ఉద్యమాల పట్ల తన అంచనాలను, అభిప్రాయాలను తెల్పేందుకు – తన అవగాహనను పెంపొందించుకొనేందుకే. వాటి ప్రజాస్వామిక డిమాండ్లకు మద్దతు తెల్పేందుకే. నిద్రనటిస్తున్నవారిని నిద్ర లేపడం కష్టతరమైనట్లు, విరసం పట్ల గుడ్డి వ్యతిరేకతతో విరసం కార్యక్రమాల్ని పరిగణలోనికి తీసుకొననివారికి జవాబు చెప్పడమూ కష్టతరమే.

'సార్వజనీనత'ను దళిత, స్త్రీ వాదాలు బద్దలు కొట్టాయని తీర్పు చెబుతూ, ఆ సార్వజనీనతను విరసం యింకా పట్టుకు వేలాడటం ఆత్మహత్యా సదృశ్యమని అఫ్సర్ విరసంకు సలహాయిచ్చాడు. అయితే విరసం అలా భావించడం లేదు. 'సార్వజనీనత'ను యెవ్వరూ బద్దలు కొట్టలేరు. ప్రతి అంశాన్ని, సంఘటననూ, ఒక చారిత్రక నేపథ్యంలో, మిగతా అంశాల, సంఘటనలతో గల సంబంధంలో చూడనివాళ్ళకు 'సార్వజనీనత' అనేది చూడనిరాకరించే సత్యం. 'సార్వజనీనత'లోనే 'నిర్దిష్టత' దాగి వుంటుందనీ, వాటి మధ్య గతితార్కిక సంబంధం వుందనే విషయాన్ని పరిగణలోనికి తీసుకొనకపోతే యే సమస్యకు అసలైన పరిష్కారాన్ని కనుగొనలేము. సార్వజనీనమైన దోపిడీ వ్యవస్థలో వివిధ సెక్షన్లు అనుభవించే ప్రత్యేక దోపిడీ, అణచివేత రూపాలుంటాయి. వాటిని సరిగా విశ్లేషించడానికి 'నిర్దిష్టత' అవసరమవుతుంది. వర్గ పోరాటమనే సార్వజనీన పోరాటాన్ని (కేవలం ఆర్థిక రంగంలోనేగాక, అన్ని రంగాలలో, చివరకు ప్రతి వ్యక్తి తనలో తాను) జరిపే క్రమంలో నిర్దిష్ట సమస్యలు తక్షణ పరిష్కారం కోరుతూ ముందుకు వస్తాయి. వాటికివ్వాల్సినంత ప్రాధాన్యత విప్లవోద్యమం గాని, విప్లవ సాహిత్యోద్యమంగాని యివ్వలేదనే విషయం ఆ ఉద్యమాల ప్రతినిధులు అంగీకరిస్తున్నారు కూడా. అయితే 'నిర్దిష్టత' సమస్యను విశ్లేషించడానికి పనికివస్తుందే తప్ప, శాశ్వత పరిష్కారాలకు దారి

తీయదు. సెక్షనల్ పోరాటాలు సమాజాన్ని మరింత ప్రజాస్వామీకరణ చేస్తాయి. ఆ సెక్షన్లలోని పీడితులకు, అణచివేతకు గురవుతున్నవారికి కొంత వెసులుబాటు, రాయితీలను కలుగజేస్తాయి. మాదిగ దండోరా డిమాండ్ ABCD వర్గీకరణ వారికి కొంత ఉద్యోగావకాశాలను మెరుగుపరుస్తుంది. అంతేగాని అది కుల వివక్షతను, ఆర్థిక అసమానతలను, సాంస్కృతిక అణచివేతను తుడిచిపెట్టదు. వెసులుబాటు, రాయితీలు అవసరమే గాని, అవే అంతిమ లక్ష్యం కారాదు. సమస్త పీడనలకు మూలమైన ఈ దోపిడీ వ్యవస్థను సమూలంగా నాశనం చేయందే, వివిధ పీడిత సెక్షన్లకు పూర్తి విముక్తి లభించే అవకాశాలు కలుగవు. పీడితులు రాజ్యాధికారం పట్టినపుడే సమస్త పీడనలనూ, అణచివేతలనూ తుడిచివేసే అనుకూల వాతావరణం యేర్పడుతుంది. అందువల్లే 'నిర్దిష్ట' సమస్యలకు మూలం 'సార్వజనీన' దోపిడీ వ్యవస్థలో వుంటుందనే విషయం అవగాహన చేసుకోవాలి. వివిధ సెక్షన్ల పీడిత ప్రజలు తమ నిర్దిష్ట సమస్యలకు వ్యతిరేకంగా పోరాడుతూనే, అన్ని పీడనలకు మూలమైన ఈ దోపిడీ వ్యవస్థకు వ్యతిరేకంగా సంఘటితంగా పోరాడాల్సిన అవసరం వుంది.

దళిత, స్త్రీ వాదాలు నిర్దిష్ట సమస్యల్ని చాలా బలంగా ముందుకు తెచ్చాయి. ఇంతవరకు విప్లవోద్యమం–విప్లవ సాహిత్యోద్యమం ఆ యా సెక్షన్ల నిర్దిష్ట సమస్యలకు తగిన ప్రాముఖ్యత నివ్వలేదని ప్రశ్నించాయి. వాటిని విరసం కాదనడం లేదు. అయితే 'నిర్దిష్టతే' సర్వ విముక్తికారి అనే సిద్ధాంతాన్ని విరసం అంగీక రించదు. 'నిర్దిష్టత'ను దాని ముగింపు వరకు లాగితే, ప్రతి వ్యక్తికీ, మరొక వ్యక్తికీ సంబంధం లేని సమస్యలుంటాయనీ, ఎవరి సమస్యల్ని వారే విడి విడి వ్యక్తులుగా పరిష్కరించుకోవాలనే అర్థరహిత వాదనకు దారి తీస్తుంది. అప్పుడు 'నిర్దిష్ట' సెక్షనల్ పోరాటాలకు అర్థం వుండదు. అందులోని వ్యక్తులూ విడి విడిగా తమ సమస్యల్ని పరిష్కరించుకోవల్సి వుంటుంది. ఇదెంత అశాస్త్రీయవాదమో ప్రత్యేకించి చెప్పాల్సిన అవసరం లేదు. 'కుల నిర్మూలన' పోరాటం కులాల మధ్య పోరాటంగా రూపుదాల్చకూడదు. 'కుల వివక్షత' కులాల మధ్య పోరాటంతో సమసి పోదు. అది వర్గ పోరాటంలో భాగంగానే జరగాలి. అన్ని కులాలలోని పీడితులు, తమ ప్రధాన శత్రువుకు వ్యతిరేకంగా జరిపే పోరాటక్రమంలో 'ఐక్యత-ఘర్షణ'ల మధ్య కుల వివక్షత సమసిపోతుంది. దీన్ని అంగీకరించేందుకు యిష్టం లేనందువల్లే

నేడు మాల-మాదిగల మధ్య ఘర్షణలకు కారణం 'అగ్రవర్ణాల కుట్ర' అనే మాటతో, వారిని యేకం చేసే బాధ్యత నుండి తప్పుకుంటున్నారు వారి నాయకత్వం. ఈ నిర్దిష్టతా వాదాన్ని పట్టుకొని వేలాడటం వల్లనే తాము ఉమ్మడిగా బలవుతున్న అగ్ర వర్ణ ఆధిపత్యానికి వ్యతిరేకంగా పోరాటం చేయాల్సిన బి.సి.లు - దళితులు - తమ మధ్య తామే కొట్లాడుకుంటున్నారు. దీన్ని గురించి యే బి.సి–ఎస్.సి. నాయకులు పట్టించుకున్న దాఖలాలు లేవు. 'నిర్దిష్టత'కు – 'సార్వజనీనత'కు దేని ప్రాముఖ్యత దానికుంది. వాటిని విడివిడిగా శత్రుపూరితమైనవిగా చూడటం తప్పు. వివిధ సెక్షన్ల ప్రత్యేక సమస్యలను విశ్లేషించినపుడు 'నిర్దిష్టత'ను పరిగణలోనికి తీసుకోవాలి. ఆ సమస్యల మూలాలను, పరిష్కారాలను మాత్రం 'సార్వజనీనత'లో చూడాలనేది విరసం అభిప్రాయం.

ఇక్కడ 'ముస్లిమీయత'ను గురించి కూడా కొంత చర్చించుకోవడం అవసరమవుతుంది. 'ముస్లిమీయత' అంటే ముస్లింల ప్రత్యేక సంస్కృతి, అలవాట్లు, ఆచార వ్యవహారాలు– ఒక మాటలో వారి ప్రత్యేక జీవన విధానంగా చెప్పవచ్చు. (మనదేశంలోని అన్ని ప్రాంతాల ముస్లింల సంస్కృతి ఒకే విధంగా ఉందా అనే ప్రశ్న ఒకటుంది. అయితే హిందూ మతదురహంకారుల అణచివేత, అన్ని ప్రాంతాల లోని ముస్లింలను ఒకే విధంగా అభద్రతా భావానికి గురిచేస్తున్నది కాబట్టి ఈ సందర్భంలో ఆ ప్రశ్న అప్రస్తుతం). మన దేశంలోని ముస్లిం జనాభాలో ముఖ్యంగా తొలి తరం వాళ్ళలో అత్యధిక శాతం అగ్రవర్ణ కులపీడనకు గురయి, దానినుండి విముక్తికోసం మతం మార్చుకున్న దళితులే నన్నది యెక్కువమంది అంగీకరిస్తున్న విషయం. ఆ తొలితరం మతం మార్చుకున్న దళితులు, 'ముస్లిమీయత'ను యిష్ట పూర్వకంగా అలవరచుకున్నవారే తప్ప పుట్టుక, పెరిగిన వాతావరణం వల్ల అలవడిన దేమీ కాదు. అలాంటప్పుడు, నేడు పుట్టుకతో హిందువైన వ్యక్తి, ముస్లింలపై జరుగుతున్న అణచివేతకు స్పందించి, వారితో మమేకమై, వారి కష్టాలను స్వంతం చేసుకొని, డి-క్లాస్; డి-కాస్ట్ అయినట్టుగా డి-రిలీజియన్ అయి ముస్లిం పేరుతో రాయడం వల్ల 'ముస్లిమీయత'కు కలిగే నష్టమేమిటో అర్థం కావడం లేదు. ఊరు దళితులు, వాడ దళితుల ఛాంపియన్‌లుగా- చెలామణీ అవుతుంటే లేని అభ్యంతరం, ఒక హిందువు 'ముస్లిమీయత'ను స్వంతం చేసుకొని, కవిత్వం రాస్తే యెందుకుండాలో

నష్టం వాటిల్లిందా ? లేదా ? అనేది చర్చనీయాంశం కావాలి. (ఖాజాకు అతని అంగీకారం లేకుండా కవితల్ని ప్రచురించడం వల్ల నష్టం వాటిల్లిన విషయాన్ని విరసం అంగీకరిస్తూనే వుంది.) అయితే చర్చనీయాంశాన్ని వదిలి, విరసం ముస్లిం ప్రజలకు ద్రోహం చేసినట్టుగా చిత్రించడం మాత్రం చాలా అన్యాయం, అక్రమం కూడా.

ఇక విరసం తన ప్రచురణలను హంగులతో, ఆర్భాటంగా ఆవిష్కరిస్తుందనీ, అయితే 'జిహాద్' సంకలన ఆవిష్కరణ గురించి విరసం పట్టించుకోలేదనీ అఫ్సర్ మరో ఆరోపణ చేసాడు. కాని, జనవరి పాఠశాలలో ఆవిష్కరించిన 'జిహాద్'నే గాక మరే విరసం ప్రచురణను యింతవరకు యెక్కడా ఆవిష్కరించలేదనేది ఒక వాస్తవం. గతంలో కూడా విరసం ప్రతి మహాసభల్లో యెన్నో పుస్తకాల్ని ఆవిష్కరించింది. అయితే ఆ తరువాత యితర ప్రాంతాలలో ఆవిష్కరణకు నోచుకున్నవి చాలా తక్కువనే విషయం సాహిత్యాభిమానులందరికీ తెలుసు. అలాంటప్పుడు 'జిహాద్'ను విరసం నిర్లక్ష్యం చేసిందనడం అఫ్సర్ కే చెల్లు.

పీడిత సెక్షన్లను ఆకర్షించేందుకు విరసంకు జిమ్మిక్కులు చేయాల్సిన అవసరం లేదు. కపట ప్రేమను ప్రకటించాల్సిన అవసరమూ లేదు. గత 27 ఏళ్ళ విరసం కార్యక్రమాలు ఆచరణ, పీడిత ప్రజలపట్ల విరసంకున్న నిబద్ధతల వల్లే విరసం పీడిత ప్రజల, విప్లవ సాహిత్యాభిమానుల అభిమానం చూరగొన్నది, చూరగొంటున్నదీ. విరసం ఆచరణ క్రమంలో యెన్నో పొరపాట్లు చేసి ఉండవచ్చు. కాని అశేష పీడిత ప్రజానీకం పట్ల వారు స్త్రీలు కావొచ్చు, దళితులు కావొచ్చు, ముస్లింలు కావొచ్చు- వారిపట్ల విరసం కున్న నిబద్ధత శంకించలేనిది. విరసం ఆచరణ ఏ కొద్ది మంది మేధావుల మెప్పుకోసమో కాదు. అన్ని రంగాలలోని, సమస్త ఆధిపత్యాల్ని యెదిరిస్తూ దోపిడీ, పీడనలేని సమాజం కొరకు జరుగుతున్న విప్లవోద్యమానికి తన ప్రతి కార్యక్రమం తోడ్పడాలనేదే విరసం ఆకాంక్ష. స్త్రీల, దళితుల, మైనారిటీల, గిరిజనుల, విభిన్న జాతులకు తమకు తామే నాయకులుగా ఎవరైనా ప్రకటించుకుంటే విరసంకు అభ్యంతరం లేదు. కాని ఆ పోరాటాలను పేటెంట్ చేసుకొని, వాటిని విరసానికి దూరంగా ఉంచాలనే ప్రయత్నాలను మాత్రం విరసం సాగనివ్వదు. విమర్శ సైద్ధాంతిక చర్చలకు దారి తీసేదిగా, జ్ఞానాన్ని మరింత సుసంపన్నం చేసేదిగా, ప్రజాస్వామికంగా ఉంచే విరసం తప్పక ఆహ్వానిస్తుంది. పాల్గొంటుంది కూడా. తన

పొరపాట్లేమైనా వుంటే సరిదిద్దుకొనడానికి సిద్ధమే. అంతేగాని శుష్క ఆరోపణలకు, నిందలకు సమాధానమిస్తూ విరసం తన సమయాన్ని వృథా చేసుకోదు–

—అరుణ్

[ఈ సమాధాన వ్యాసం జూలై మొదటి వారంలో 'వార్త' దినపత్రికకు కా॥ వేణుద్వారా పంపబడింది. కాని ఇంతవరకు ప్రచురణ కాలేదు. ఈ వ్యాసమే గాక గతంలో సౌదాకు విరసం కార్యవర్గం రాసిన సమాధానం, సౌదా బహిష్కరణపై కె. శ్రీనివాస్ కవిత 'లేచిపో సౌదా'కు జవాబుగా నేను (అరుణ్) రాసిన కవిత 'లేచిపో కామ్రేడ్' కూడా ప్రచురింపబడక పోవడం, దినపత్రికలు సాహిత్య చర్చలను యెంత అప్రజాస్వామికంగా నిర్వహిస్తున్నాయో తెలియచేస్తుంది.]

## నాడు... నేడు

రాముడి అనుమానాల్లో
అగ్నిప్రవేశం చేసింది సీత
కృష్ణుడి 'ప్రేమ'కు గోపికలు
ఆటవస్తువులయ్యారు
హరిశ్చంద్రుడి సత్యం అంగట్లో
చంద్రమతి సరుకయింది

రాజాస్థానపు రాజకీయాలలో
ద్రౌపది విలాస వస్తువయింది
నేటి స్త్రీ
మనుధర్మాన్ని మంటగలిపి
గర్జించి
గన్నుపట్టి లేచింది

— సుదర్శన్

# విరసం - త్రిపురనేని శ్రీనివాస్

గుంటూరులో త్రిపురనేని శ్రీనివాస్ కవితా సంకలనం 'హో' ఆవిష్కరణ సభలో ఆ పుస్తకాన్ని తగులబెట్టడం జరిగిందని, ఇందులో విరసం చెయ్యి ఉందని కొందరు వ్యక్తులు పనిగట్టుకుని ప్రచారం చేస్తున్నారు. ఆ సమయంలో విరసంలో ఇటీవలనే క్యాండిడేట్ సభ్యుడుగా చేరిన ఒక సభ్యుడు అక్కడ ఉండడాన్ని అవకాశంగా తీసుకుని మొత్తంగా విరసంమీద బురద జల్లడానికి పూనుకుంటున్నారు. హోను విరసం తగులబెట్టలేదు. విరసానిది పుస్తకాలు తగులబెట్టే సంస్కృతి కాదు. ఎంతటి ప్రమాదకరమైన, అభివృద్ధి నిరోధక, అరాచక భావాలనైనా భావాలతోనే ఎదుర్కోవాలని విరసం భావిస్తుంది. త్రిపురనేని శ్రీనివాస్‌కూ విరసానికీ మధ్య ఉండిన వ్యతిరేకతను ఆసరాగా తీసుకుని తమ పబ్బం గడుపుకోవాలనుకునే విరసం వ్యతిరేకులు, మార్క్సిస్టు వ్యతిరేకులు చేస్తున్న దుష్ప్రచారాన్ని విరసం తీవ్రంగా ఖండిస్తోంది.

ఈ సందర్భంలోనే త్రిపురనేని శ్రీనివాస్‌కూ, విరసానికి మధ్య ఉండిన ఒడిదుడుకుల సంబంధం గురించి చెప్పుకోవాలి. శ్రీనివాస్ విద్యార్థి ఉద్యమం నుంచి, విప్లవోద్యమం నుంచి విరసంలోకి వచ్చాడు. అప్పటికే ఆ యా నిర్మాణాలకు ఆయనతో సమస్యలు ఉన్నప్పటికీ, కవిగా, భావుకుడుగా, క్రియాశీల వ్యక్తిగా ఆయనను విరసం ఆహ్వానించింది. కాని చేరిన రెండు సంవత్సరాల లోపే శ్రీనివాస్‌కూ విరసం విలువలకూ మధ్య అంతరం కనబడడం మొదలయింది. స్పష్టంగా చెప్పాలంటే, 1988 జనవరిలో శ్రీనివాస్ బహిష్కరణ జరిగినప్పటికీ, 1986 నుంచే శ్రీనివాస్ అభిప్రాయాల గురించి, ప్రవర్తన గురించి, విలువల గురించి చర్చ కొనసాగుతూ వచ్చింది. నిజానికి ఈ చర్చా క్రమంలో కూడ శ్రీనివాస్ వైపునుంచి నిర్దిష్టమైన అభిప్రాయాలు, వాదనలు రాలేదు గాని, విరసం నిర్ణయాలను, విలువలను ఏక వాక్యంలో ఖండించడం, "నేను పాటించను" అనడం జరిగేది. ఇదంతా 'అట్లానే ఎందుకు చేయాలి, ఇట్లా ఎందుకు చేయగూడదు' అని ఆయన నమ్మిన తాత్విక విశ్వాసంలో భాగమే. కాని, ఆ విశ్వాసం ఆయనలో ఎప్పుడూ వివరంగా, వాదనగా కాక, ఒక సంచలనాత్మక ప్రకటనగానే మిగిలిపోయింది.

విరసం సర్వసభ్య సమావేశంలో (విజయవాడ) మొదటిసారి ఆయన విరసం ఆలోచనలకు భిన్నంగా ఉన్నాడని, మెజారిటీ అభిప్రాయాన్ని గౌరవించడానికి సిద్ధంగా లేడని బైటపడింది. శ్రీశ్రీ మృతి సందర్భంగా ఆంధ్రజ్యోతి, పురాణం సుబ్రహ్మణ్య శర్మ తీసుకున్న వైఖరి వల్ల విరసం ఆంధ్రజ్యోతి వార పత్రికకు రచనలు పంపగూడదని 1983లో నిర్ణయించింది. 1986 చివరిలో త్రిపుర నేని శ్రీనివాస్ రచనలు ఆంధ్రజ్యోతి వారపత్రికలో రావడంపై విజయవాడ సర్వ సభ్య సమావేశం చర్చించి, సంఘ నిర్ణయాన్ని ఉల్లంఘించినందుకు ఆయనను తప్పు పట్టింది. సమావేశంలో ఆయన ఒంటరి అయిపోయాడు. అప్పుడు కూడ ఆయన తన తప్పును ఒప్పుకోలేదు. అది తప్పనీ అనుకోలేదు. ఆ నిర్ణయమే తప్పని, ఆంధ్రజ్యోతికి రాయాలని తాను అనుకుని ఉంటే అది చర్చకు పెట్టి, తన వాదన వినిపించి, తోటి సభ్యులను ఒప్పించి ఉండవచ్చు. కాని, ఆ చర్చ జరిగినంతసేపూ "నేను రాసేది రాసేదే" అని తప్ప మరొక మాట అనలేదు.

ఆ తర్వాత కొన్నాళ్ళకే, ఉద్యోగరీత్యా ఆయన విజయవాడ వచ్చి కృష్ణా జిల్లా యూనిట్‌లో చేరాడు. 1985-89 నిర్బంధకాలంలో క్రియాశీలంగా పని చేసిన అతి కొద్ది యూనిట్లలో కృష్ణా యూనిట్ ఒకటి. యూనిట్ సమావేశాలు, చర్చలు, బహిరంగ సమావేశాలు, సోదర సంఘాలతో ఐక్యకార్యాచరణ, సాహిత్య కృషి- అన్నిటిలోనూ కృష్ణా యూనిట్ చాల చురుకుగా ఉన్న సందర్భం అది. ఈ సాహిత్య, సామాజిక కృషిలో శ్రీనివాస్ పాత్ర చాల ఉంటుందని ఆశించిన సభ్యులకు మొదటినుంచీ ఆయనలోని వ్యక్తివాద, కెరీరిస్టు, అరాచక, తోచింది చేసే ధోరణులు కనబడి ఇబ్బంది పెట్టాయి.

"పోస్టర్లు వేయడం నా రక్తంలో లేదు" అనే దగ్గర ప్రారంభించి, యూనిట్ సమావేశాలకు ఎందుకు రావాలి అనేవరకు, విరసం విలువలకూ, నిర్మాణ అవసరాలకూ భిన్నమైన వైఖరిని బహిరంగంగా తీసుకోవడం మొదలుపెట్టాడు. ఆ రోజుల్లోనే అన్ని దినపత్రికల్లో సాహిత్య పేజీలు మొదలయ్యాయి. హఠాత్తుగా పత్రికల్లో సాహిత్య చర్చలు, పరిశీలనలు పెరిగాయి. అవన్నీ అధ్యయనం చేయడం ఏ ఒక్కరికయినా ఇబ్బంది అవుతోందని, కనుక ఒక్కొక్కరు ఒక్కొక్క వారం అన్ని పత్రికలూ చదివి యూనిట్లో ఒక సమీక్ష లాంటిది చెయ్యాలని ఒక ప్రతిపాదన వచ్చింది. అప్పుడున్న సభ్యుల సంఖ్యను బట్టి ప్రతి ఒక్కరికీ రెండు నెలలకోసారి

మాత్రమే ఆ బాధ్యత పడేది. ప్రతిపాదన రాగానే శ్రీనివాస్ ప్రతిస్పందన : "ఆ చెత్తంతా ఎవడు చదువుతాడు ? టీఎల్ కాంతారావును నేను చచ్చినా చదవను" అని. మరొకవైపు తానే తను పనిచేసే దినపత్రికలో సాహిత్యపేజీకి బాధ్యుడిగా ఉండి అందులో ఏ సాహిత్య విలువలూ లేని, పచ్చిబూతును వర్ణించే జుగుప్సాకరమైన రచనలు అచ్చువేశాడు. ఉద్యోగ ధర్మంగా వేయవలసి వచ్చే రచనలను అర్థం చేసుకుంటూనే, సాహిత్యంగా కూడ చెప్పడానికి వీలులేని అటువంటి క్షుద్రరచనల్ని ఎందుకు ప్రోత్సహించవలసి వచ్చిందని యూనిట్ సభ్యులు అడిగారు. ఇటువంటి ఒకటి రెండు సందర్భాల తర్వాత శ్రీనివాస్‌కూ తమకూ మధ్య భావసారూప్యత గాని, సభ్యత్వ ఐక్యతగాని కనబడడం లేదని మెజారిటీ సభ్యులు భావించారు.

ఈ సమస్య యూనిట్‌లో పరిష్కారమయ్యే అవకాశాలు కనిపించక పోవడం వల్ల, సమస్యను సర్వసభ్య సమావేశం ముందుపెట్టి, మిగతా సభ్యుల సూచనలు అడగాలని కృష్ణా యూనిట్ భావించింది. సభ్యుడుగా ఉంటూ సంస్థ పనులు చేయననడం, సంస్థ విలువలకు భిన్నంగా ప్రవర్తించడం, కనీసం యూనిట్ సమావేశాలకు కూడ హాజరు కాకపోవడం మొదలైనవి అప్పుడు సంస్థలో పెద్ద ఎత్తున సాగుతున్న సభ్యుల సెన్స్‌ఆఫ్ బిలాంగింగ్ (బాధ్యతా స్పృహ) చర్చలో భాగం కనుక ఈ సమస్యను సర్వసభ్య సమావేశం ముందుకు తీసుకుపోవాలనుకోవడం జరిగింది.

ఇదిలా వుండగా 87లో చీరాలలో జరిగిన సర్వసభ్య సమావేశంలో స్త్రీ పురుష సంబంధాల చర్చ వచ్చినపుడు శ్రీనివాస్ తాను free Sex సిద్ధాంతాన్ని సమర్థిస్తున్నానని చెప్పాడు. విరసంలో మౌలికంగా పరస్పర విరుద్ధమైన భావాలు కూడా ఉండవచ్చనీ, విరసం ఆఫ్ఘనిస్తాన్‌లో రష్యా సైనిక జోక్యాన్ని దురాక్రమణగా భావించినపుడు, శ్రీశ్రీ దానిని ఏప్రిల్ విప్లవంతో పోల్చినంత మాత్రాన ఆయనపై క్రమశిక్షణా చర్య తీసుకుని వుండవలసింది కాదనీ వాదించాడు.

ఒంగోలులో 1988 జనవరిలో జరిగిన సర్వసభ్య సమావేశంలో త్రిపురనేని శ్రీనివాస్ గురించి చర్చ వచ్చింది అది కూడ నేరుగా ఆయన గురించి చర్చగా (ఎజెండాలో ఒక ప్రత్యేక అంశంగా) రాలేదంటేనే, ఆయన మీద కక్ష సాధింపుగా అది జరగలేదని అర్థం. యూనిట్ నివేదికలు అనే అంశంలో, కృష్ణాజిల్లా యూనిట్ తరఫున కా॥ కృష్ణాబాయి నివేదిక ఇస్తూ చేసిన పనులు, చెయ్యలేకపోయిన పనులు,

సమస్యలు వివరించారు. ఆ సమస్యల్లో ఒకటిగా శ్రీనివాస్ సమస్య, అది పరిష్కరించకపోతే ఇతరులలో వ్యాపించగల నిరాసక్తత, నిర్మాణ సూత్రాల వ్యతిరేకత చర్చకు వచ్చాయి. అప్పటికి ఆయన కృష్ణా యూనిట్‌కు వచ్చి కొద్దికాలమే అయింది గనుక, ఎక్కువకాలం తిరుపతి యూనిట్‌లో ఉన్నాడు గనుక ఆ యూనిట్ సభ్యుల అభిప్రాయం కోరడం జరిగింది. ఆ యూనిట్ నుంచి హాజరయిన సభ్యుల్లో త్రిపురనేని మధుసూదనరావు, సౌదా ఇద్దరు మాత్రమే తమ అభిప్రాయాలు చెప్పారు. శ్రీనివాస్‌లో మొదటి నుంచీ అరాచకత్వం ఉందని, శ్రీనివాస్ ఏ నిర్మాణంలోనూ ఇమడడని, క్రమశిక్షణతో ఆచరణలో పాల్గొనలేదని, ఆయనను సవరించడం అసాధ్యమని, కనుక సభ్యత్వం నుంచి బహిష్కరించాలని మధుసూదనరావు అన్నారు. సౌదా, శ్రీనివాస్ సమస్య ఎట్లా పరిష్కరించాలో చెప్పేదేమీ లేదంటూనే, "చలపతి, సీను, నేను ముగ్గురం కలిసి రాజకీయాల్లోకి వచ్చాం. చలపతి చనిపోయాడు. సీనును పంపించేశాం. నేను మిగిలాను" అని ఏడుస్తూ అన్నాడు. నిజానికి అప్పటికి బహిష్కరణ ప్రతిపాదన మాత్రం వచ్చింది గాని నిర్ణయం జరగలేదు. సౌదా వ్యాఖ్యతో, సమావేశంలో ఆ ప్రతిపాదన పట్ల వ్యతిరేకత రాకపోవడంతో శ్రీనివాస్ బహిష్కరణ జరిగిపోయింది.

తర్వాత ఎనిమిది సంవత్సరాలలో చాల విషయాలు జరిగాయి. విరసానికీ, త్రిపురనేని శ్రీనివాస్‌కూ మధ్య వ్యతిరేకతలు నేరుగా వ్యక్తం కాకపోయి ఉండవచ్చు. కాని ఆయన చేసిన ప్రతి చర్యా విరసం వ్యతిరేకతకి ఒక వ్యక్తీకరణగా ఉంటూ వచ్చింది. (ఆయన దళిత, స్త్రీవాద మిత్రుడుగా జరుగుతున్న ప్రచారం నిగ్గు ఇంకా తేల్చవలసే ఉంది. ఈ రెండు ధోరణులకూ ఆయన పోషకుడుగా ఉన్నాడేమో గాని సహానుభూతి చెందాడా అనేది ఆయన చేసిన ఇతర పనుల నేపథ్యంలో అనుమానంగానే ఉంటుంది. ఒకవైపు స్త్రీవాద మిత్రుడిగా ఉన్నవాడు, స్త్రీ శరీరాన్ని అమ్మకపు సరుకుగా మార్చే పనిలో అత్యంత ప్రతిభావంతుడైన సంపాదకుడయ్యాడు.) విరసం మీద విషం కక్కిన శివసాగర్‌ను ప్రోత్సహించాడు. ప్రజా పోరాటాలపట్ల నిబద్ధతను గేలి చేశాడు. వ్యక్తిగత జీవితంలో విలువలు ఉండడం చాదస్తంగా భావించాడు. వ్యక్తిగత జీవితంలో భోగలాలసత ఒక్కటే పాటించదగిన విలువగా ప్రచారం చేశాడు. విప్లవోద్యమానికి ద్రోహం చేసి, అతి ముఖ్యమైన రహస్యాలు పోలీసులకు

అమ్మినవాళ్ళను ఆదరించాడు. ఉన్న అవకాశాలతో నిధులు, కాగితం సంపాదించి ప్రచురణల పేరుతో కవిత్వ పోషకుడయ్యాడు.

అయినా, విరసం ఎప్పుడూ ఆయన మీద విమర్శలు చేయలేదు. ఆయన దారి ఆయనదని, ఎప్పటికయినా అది ఎంత ప్రమాదకరమైనదో ఆయన ప్రభావంలో పడ్డవాళ్ళు గుర్తించి బైటపడతారని విరసం భావించింది

శ్రీనివాస్ మరణం విచారకరమైనదే అయినా ఆయన మిత్రులుగా చెప్పుకుంటున్నవాళ్ళకు ఆ విచారం కన్న ఎక్కువగా విరసం మీద దాడి చేయడానికి సందర్భం దొరికిందని పండగగా ఉన్నది. శ్రీనివాస్ మృతి నాటినుంచీ సాగుతున్న ఈ ప్రయత్నాలకు పరాకాష్ఠగా హో ప్రచురణ వివాదాన్ని రేకెత్తించదలిచారు. విరసం పోరాటం విలువలతో, అభిప్రాయాలతో కాని వ్యక్తులతో కాదు. హోలో గ్రాఫిటి పేసు మీద ప్రకటించిన నీచ అభిప్రాయాలు ఆ "రచయితల" నీచ సంస్కృతికే నిదర్శనం. వాటినెవరూ తగులబెట్టనక్కరలేదు.

— జి. కళ్యాణరావు

కార్యదర్శి, విరసం

---

## దండోరా

మనువు కళ్ళను ఆరెతో
కసితీరా పొడిచి
వంకర కత్తితో
పేళ్ళు నరికి
నాలుక తెగ్గోసి
గూటంతో గుద్ది చంపి
డొక్క చీల్చి
డప్పు చేసి
పక్క బెముకలు విరిచి
పుల్లలుగా చేసి
అగ్రకుల దురహంకారం మీద
దరువేద్దాం రండి !

— నల్లోడు

---

# మంచి వెంకట నరసయ్యకు విప్లవ జోహార్లు

"ఈ విప్లవాగ్నులు ఎచటివని అడిగితే శ్రీకాకుళము వైపు చూడమని చెప్పాలి" అని నినదించిన గళం శాశ్వతంగా మూగబోయింది. 1968లో నక్సల్బరీ సంఘీభావ కమిటీని ఏర్పరచి, ఎందరో యువ మేధావుల్ని ఉత్తేజపరచి, పోలీసుల చిత్రహింసలను వీరోచితంగా ఎదుర్కొని, పార్వతీపురం, చందవరం కుట్రకేసుల్లో జైలుశిక్ష అనుభవించిన విప్లవకారుడు, కార్మికుడు, మేధావి, కవి అయిన మంచి వెంకట నరసయ్య 1920లో గుంటూరు జిల్లా నిడుముక్కల గ్రామంలో జన్మించారు. తండ్రి - రామబ్రహ్మం, తల్లి –వీరమ్మ. తన చిన్నతనంలోనే తండ్రి మరణించడంతో జీవన పోరాటంలో ప్రవేశించాడు. చిన్నతనం నుండే జీవితంలో ఒడిదుడుకుల్ని చవిచూశాడు. హేతువాద దృక్పథాన్ని అలవర్చుకున్నాడు. చదివింది రెండో తరగతే అయినా ఎన్నో గ్రంథాలు పఠించి, గొప్ప పాండిత్యాన్ని సంపాదించాడు. యౌవనంలో భారత జాతీయ కాంగ్రెసులో చేరి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నాడు. ఆ తర్వాత స్వతంత్ర పార్టీలోనూ, సోషలిస్టు పార్టీలోనూ పని చేశాడు. నిజాయితీ, సమరశీలత ఉన్న ఆయన చివరకు భారత కమ్యూనిస్టు పార్టీలో చేరాడు. 1964లో సి.పి.ఐ.(ఎం.) ఏర్పడ్డప్పుడు అందులోకి మారాడు. 1967లో ఒకవైపు నక్సల్బరీ (బెంగాల్)లో, మరోవైపు శ్రీకాకుళంలోనూ విప్లవోద్యమాలు చెలరేగుతున్నప్పుడు వాటిని నీరుగార్చే ప్రయత్నంలో ఉన్న సి.పి.ఐ. (ఎం.)ను వదిలి 1968 లో గుంటూరులో నక్సల్బరీ సంఘీభావ కమిటీని ఏర్పరచాడు.

1970లో అరెస్టయ్యాడు. పోలీసుల చిత్రహింసలను ధైర్యంగా భరించారే గాని, లొంగలేదు. 1974 లో బెయిలుపై బయటికి వచ్చాడు. మూడేళ్ల తర్వాత మళ్ళీ జైలుకు వెళ్ళాడు. మళ్ళీ మూడేళ్ళ జైలు జీవితం అనుభవించి బయటికి వచ్చాడు. అప్పటికి షుమారు 60 ఏళ్ళ వృద్ధాప్యంలో ఉద్యమం నుంచి విరమించుకొని తన వృత్తిని తిరిగి చేపట్టాడు. రిక్షాబండ్లు తయారు చేసుకుంటూ తన పిల్లలను చదివించుకున్నాడు. వాళ్ళు స్థిరపడ్డ తర్వాత కూడా శ్రమిస్తూ తన 77వ యేట - ఇటీవల జులై మొదటి వారంలో మరణించారు.

మంచి వెంకట నరసయ్యకు విప్లవ జోహార్లు.

— కార్యదర్శి, విరసం

లేఖ

# రిజర్వేషన్లు "కుక్క బిస్కెట్లు కావు"

అరుణతార ఎడిటర్ గారికి,

'అరుణతార' జూన్, 1997 సంచికలో 'ఇది మాస్ మూమెంట్ !' (పేజి నం. 5) అను టైటిల్‌తో శ్రామికుడు రాసిన కవితలో రిజర్వేషన్ల గురించి రెండు పాదాలు రాసాడు. ఈ పాదాలు రిజర్వేషన్ల మీద తప్పుడు అవగాహన ఇచ్చేవిగా ఉన్నాయి. శ్రామికుని కవిత ఇలా సాగుతుంది

అలా నడిచి వెలుతున్న ఓ ఆడ మనిషిని పలకరించాను
'ఏమండీ! కన్యాశుల్కానికి, వరకట్నానికి పెద్ద తేడా లేదు కదూ' అన్నాను
రాజ్యంకు నసాళానికి అంటింది
పిచ్చి పిచ్చిగా అరుస్తు అంతుచూస్తానంటూ తుపాకీ ఎత్తింది
ఊరి బయట అంటరాని వ్యక్తిని 'హల్లో' అన్నాను
నీకు రిజర్వేషన్లు కుక్క బిస్కెట్లు తెలుసా ? అన్నాను
తాళలేక పోయింది రాజ్యం
బొమికలు కూడ మిగల్చనంటూ తుపాకీని అటుఇటు తిప్పింది

ఈ కవితా పాదాల్లో రిజర్వేషన్లను 'కుక్క బిస్కెట్లు'గా చెపుతున్నాడు కవి. పాలకవర్గాలు దళితులకు రిజర్వేషన్లు ఇచ్చి వారిని జోకొట్టాలని చూస్తున్నాయనే అవగాహనలో 'రిజర్వేషన్ల'ను 'కుక్క బిస్కెట్లు'గా శ్రామికుడు చెప్పాడనిపిస్తుంది. కాని రిజర్వేషన్లు పాలక వర్గాల దయాదాక్షిణ్యాలతో కల్పించబడినవి కావు. వేల సంవత్సరాలుగా కులం పేరుతో విద్యనుండి, ఉద్యోగాలనుండి ఒక్క మాటలో మొత్తం సామాజిక జీవితం నుండే వెలివేయబడిన దళితులు తమకు నిరాకరింపబడిన అవకాశాలను, మనుషులుగా తమకు చెందాల్సిన హక్కులను సాధించుకోవడానికి కొన్ని సంవత్సరాల తరబడి సాగించిన పోరాట ఫలితమే నేటి రిజర్వేషన్లు. అయితే దళితుల పోరాటాలకు తలవొగ్గక తప్పని పరిస్థితుల్లో కల్పించబడిన ఈ రిజర్వేషన్లను దళితులను మభ్యపెట్టటానికో, తాము చేస్తున్న దోపిడిని, అమలుచేస్తున్న అణచివేతను ఎదిరించకుండా వారిని సంతృప్తిపరచటానికో పాలక వర్గాలు ఉపయోగించుకుంటున్న మాట వాస్తవమే. దీనిని ఎవ్వరం కాదనలేము. అయితే ఈ విషయం ప్పటానికి మనం రిజర్వేషన్లను "కుక్కబిస్కెట్ల"తో పోల్చనక్కరలేదు. నిజానికి జర్వేషన్లను "కుక్క బిస్కెట్లు"గా అర్థం చేసుకుంటున్నది పాలకవర్గాలు. ర్వేషన్లు కల్పించినట్లయితే దళితులు ఇక పోరాటాలు చేయరని, చేయకూడదని

ఆశిస్తున్నది పాలకవర్గాలే. అలా ఆశించడం అర్థం చేసుకోవడం పాలకుల నైజం. కాని మనం రిజర్వేషన్లను దళితులు పోరాడి సాధించుకున్న హక్కుగా గుర్తిస్తు న్నాము. ముఖ్యంగా మండల్ కమీషన్ రిపోర్ట్ మీద జరిగిన వివాదంలో రిజర్వేషన్ల మీద మనం స్పష్టమైన వైఖరిని ప్రకటించాం. అగ్రకుల విద్యార్థులు మండల్ వ్యతి రేక ఉద్యమం నడుపుతున్న తరుణంలో రాడికల్ విద్యార్థి సంఘం చొరవచేసి అన్ని దళిత, ప్రజాస్వామిక విప్లవ, విద్యార్థి, ప్రజాసంఘాలను ఒక వేదిక మీదకు తెచ్చి మండల్ కమీషన్ రిపోర్టుకు మద్దతుగా ఐక్యకార్యచరణ కమిటీని ఏర్పరచి, రిజర్వే షన్లు దళితుల, అణగారిన కులాల హక్కని, అది వారు పోరాడి సాధించుకున్నారని బలంగా వాదన లేవదీసింది.

సమాజంలో పీడిత ప్రజలు చేసే పోరాటాలకు తలవంచక తప్పని పరిస్థితుల్లో పాలక వర్గాలు వారికి కొన్ని హక్కులను, అవకాశాలను ఏర్పరుస్తూ సంస్కరణలు చేస్తాయి. అలా చేయడం ద్వారా ఆ యా సెక్షన్ల ప్రజలను సంతృప్తి పరచి, మభ్య పెట్టి వారిని అంతిమ విముక్తి వైపు వెళ్ళకుండా అడ్డుకోవాలని పాలక వర్గాలు ఎపుడూ ప్రయత్నిస్తుంటాయి. ఇది అపుడు దళితులకు కల్పించబడిన రిజర్వేషన్స్ నుండి నేడు 81 వ రాజ్యాంగ సవరణద్వారా స్త్రీలకు చట్ట సభల్లో 30% రిజర్వేషన్ కల్పించే దిశగా కొనసాగుతుంది. ఇదంతా సమాజంలోని వివిధ అసమ్మతి గ్రూపులను తమలో ఇముడ్చుకొని వారి వల్ల ఈ వ్యవస్థకు ఏ 'ప్రమాదం' సంభవించకుండా ఉండడానికి పాలకవర్గాలు చేపడుతున్న సంస్కరణల్లో భాగంగా జరుగుతున్నదే. ఈ సంస్కరణల వెనక ప్రజల పోరాటం ఉంది. అలాగే పాలక వర్గాల కుట్రకూడా ఉంది. ఇక్కడే మనం పాలక వర్గాల కుట్రను బహిర్గతం చేసి సమాజంలోని అన్ని పీడిత సెక్షన్ల ప్రజలను అంతిమ విముక్తివైపు నడిపించు కోవాల్సి ఉంటుంది. ఈ క్రమంలో రిజర్వేషన్లను ఆ మాటకొస్తే ప్రజలు పోరాడి సాధించుకున్న అన్ని అవకాశాలను 'హక్కులు'గానే గుర్తిద్దాం. అలా గుర్తించడం లోనే ఆ యా హక్కుల సాధన వెనక ఉన్న ప్రజల్ని, వారు చేసిన పోరాటాల్ని గుర్తించిన వాళ్ళమవుతాము. అదే సమయంలో "రిజర్వేషన్స్" వంటి సంస్కరణ లకు ఉన్న పరిమితులను (ముఖ్యంగా పబ్లిక్‌రంగ సంస్థలన్ని ప్రైవేటీకరణ చేయ బడుతున్న ఈ సందర్భంలో) వివరిస్తూ, దళితుల నిజమైన అభివృద్ధిని, నిజమైన విముక్తిని సాధించడానికిగాను మొత్తం సమాజ విముక్తికై జరుగుతున్న పోరాటాల్లో వాళ్ళను భాగం చేసుకోవాలి.

—అజ్ఞాతపుత్రుడు
5.8.9

# సారే జహాఁసే అచ్ఛా హిందూస్తాన్ హమారా

ధుత్ ! ఎగేసి తన్నండ్రా ఎదవదేశాన్ని !
ఇన్ని సంవత్సరాలు దొర్లినా
నూటికి నలభై దొక్కల్ని మాడుస్తూనే వుంది.
'రేయ్ ! ఎవడెహె వాడు ! దేశమంటే మనుషులంటున్నది !
అర్థ శతాబ్ద స్వాతంత్ర్యం
నేలకు తొర్రలు పెట్టి కెలుకుతున్న పందికొక్కలా
గుల్లమంటూనే వుంది !
తీసి దిబ్బలో కొట్టండ్రా దాన్ని సర్వసత్తాక గణతంత్ర రాజ్యాంగమంట !
ప్రపంచంలో అతిపెద్ద చెత్తబుక్కు అది
పార్లమెంటు డ్రైనేజీ తొట్లో మునిగి కంపుగొడ్తా వుంది.
ఇంత నిప్పెట్టి ఆ మూడు రంగుల బట్టను బుగ్గి చేస్తే సరి !
భిన్నత్వంలో ఏకత్వమంటూ తెగ మెలితిరిగిపోతుంది !!
ఎన్నో జాతుల నెత్తుటి ప్రవాహాలు నా దేశంలో
జీవనదుల సంఖ్యను పెంచుతూనే వున్నాయి.
ఇంకా ఏం చూస్తున్నార్రా ?
పలుగు పారలు పట్టుకుని పరిగెత్తుకురండ్రా దేశపౌరుల్లారా !
విజయమో వీరమరణమో తేల్చుకుందాం ?!

— శ్రామికుడు

19.. NATARA AUGUST 1997 H/GTR-70
Annual Subscription Rs. 50/- Single Issue Rs. 5/-

# స్వర్ణోత్సవ భారతి

వ్యంచులోయలనుండి తెలంగాణా పల్లెలదాకా
దగాపడ్డ గుండెల్లో రగులుతున్న కసి
ప్రతిరోజూ పతాకశీర్షికల్లో దొంగఎదురుకాల్పుల కథనాలు
మరో జలియన్‌వాలాబాగ్‌గా ఇంద్రవెల్లి
పాటగొంతును నొక్కబోయి బోర్లాపడ్డ హైటెక్‌తూటాలు
సామాన్యుడి మెడకు బిగుసుకున్న డంకెల్ ఉచ్చు
చెమట విత్తనాల్ని చల్లినందుకు పురుగుమందే సద్దన్నమైన రైతు
స్వదేశీ బదులు సర్వం విదేశీ
క్విట్ ఇండియా కమ్ ఇండియాగా మార్పు
సరళీకరణ ప్రైవేటీకరణల హోరులో
తడిగుడ్డతో గొంతుకోసే సామ్రాజ్యవాదం
రామర్ పెట్రోలుకు విస్తుబోయి పేటెంట్ నిరాకరించిన మేధస్సు
అరగంటకో చెరచివేత
రెండుగంటలకో వరకట్నపుకేక
కింగ్‌జార్జిలో కన్యాత్వాన్ని పరీక్షించిన ధన్వంతరివాసులు
సరయూనది సాక్షిగా గుండెల్నికూల్చిన కరసేన
రాజకీయాల్లో హిందూత్వ భావనను
వాడుకోవడం తప్పుకాదన్న సెక్యులర్ న్యాయస్థానం
కళే ప్రాణమనుకొన్నందుకు బుగ్గిపాలైన హుసేన్ ఆర్ట్ గ్యాలరీ
బోఫోర్స్ యూరియా సెక్యూరిటీలతో దివాలాదీయించిన హవాలాలు
రాజ్యాంగం రాసినందుకు చెప్పులదండల సన్మానాలు
జనం కళ్ళలోంచి సముద్రాలు కారుతుండగా
భూమి, భుక్తి, విముక్తుల కోసం
బిగుసుకుంటున్న పిడికిళ్ళమధ్య
వెక్కిరించిన పతాకం
స్వర్ణోత్సవ జాతీయపతాకం.

— గౌస్ మొహియుద్దీన్

...gendra Press, VJA-2, on behalf of Venkataramana
...tur-1, for Revolutionary Writers' Association.

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M113 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | ఉంది |
| వెనుక అట్ట | ఉంది |
| మొత్తం పేజీలు | 55 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Bhanusree |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | sireesha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |